# WONDERS IN LITERATURE

# The Animal Kingdom

# సాహిత్యంలో జంతుజాలం

(PART ONE)



by M.S. SASTRY B.Sc. [Pharm.]

ముద్రణ :
గార్డన్ ప్రెస్
బ్రాడీపేట : గుంటూరు

ప్రాణి కోటి పై
అనురాగము చూపే
ప్రేమ మూర్తులకు

*



# సాహిత్యంలో 'జంతుజాలం'

## మొదటి భాగంలో



## రెండవ భాగంలో



మొదలగు మరికొన్ని జంతువుల గురించిన

— సాహిత్య విశేషాలు —

Wonders in Literature: **THE ANIMAL KINGDOM**

# సాహిత్యంలో 'జంతుజాలం'

రచన :

ఎమ్. ఎస్. శాస్త్రి, బి.యస్.సి. (ఫార్మసీ)

ఆశీస్సు :

శ్రీ నార్ల వెంకటేశ్వరరావు

చిత్రణ :

శ్రీ తేజోమూర్తుల కేశవరావు

**
*

**J A Y A N I K E T A N**

TADEPALLIGUDEM (W. G. Dist.) | Branch Office: MADRAS-7

# ఆశీస్సు

'పుస్తకం దేనికి ?'

'చదవడం కోసం'

ఈ ప్రశ్నోత్తరాలు పరమానందయ్యగారి శిష్యునికీ, ఆ గురూత్తమునికే చెల్లునని నవ్వి వేయడానికి ముందు కడకంటా చదవలేక ఏ కొద్ది పుటల తరవాతనో మీరు ఒక పక్కకు నెట్టిన పుస్తకాలెన్నో జ్ఞాపకం తెచ్చుకోడానికి ప్రయత్నించండి. 'చదవడంకోసమే పుస్తకం' అనే విషయాన్నే ప్రతి రచయిత గుర్తిస్తే, "చదివించగల" ప్రజ్ఞ లేనివారు పుస్తకాలను వ్రాయటం విరమిస్తే, చిత్తుకాగితాల మార్కెట్టుకు సరుకు అందడం కష్టమైపోతుంది.

రచయితకు కావలసిన ఈ ప్రథమ యోగ్యత—"చదివించగలగడం"—నా మిత్రులు, ఒకప్పుడు—నా సహాయ సంపాదకులు శ్రీ ముద్దా విశ్వనాథంగారికి వలె ఆయన కుమారుడు చిరంజీవి ఎమ్. ఎస్. శాస్త్రికికూడా విశేషంగా వున్నది.

శాస్త్రి రచనలలో ఇది—"సాహిత్యంలో జంతు జాలం"—మూడవది. ఈమూడింటిలో దేన్ని—ముఖ్యంగా ఈ మూడవదాన్ని—చదవడం ప్రారంభిస్తే ముగించకుండా విడిచిపెట్టలేము. ఇంతే కాదు—ఎక్కడైనా మొదలుపెట్టి, ఎంత వరకైనా వీటిని చదవవచ్చు. శాస్త్రి రచనా పటి మకు ఇది తిరుగులేని తార్కాణం.

మిత్రుని కుమారుడని శాస్త్రికి నేను ఇంత పెద్ద కితాబు లివ్వడంలేదు. ఏవో కొత్త విష యాలను గురించి వ్రాస్తూ చదువరికి ఆసక్తి కలిగించడం ఒక విశేషం కాదు. అందరికీ తెలి సిన పాత విషయాలను గురించి వ్రాస్తూ కూడా ఆసక్తితో చదివించగలిగినప్పుడే రచయిత వస బయటపడుతుంది. శాస్త్రి తన రచనలలో ఏరి కూర్చుకొన్నవన్నీ పాత విషయాలే. పైగా కుక్క—నక్క, గుర్రం—గాడిద, ఆవు—ఎద్దు మొదలైన సామాన్య జంతువులను గురించి. అయినా, పాఠకుల దృష్టిని శాస్త్రి ఎంతగానో ఆకర్షించగలుగుతున్నాడంటే, వారిని అలరించ గలుగుతున్నాడంటే—నేనే గాక ఎవరైనా సరే రచయితగా అతనిని మెచ్చుకొనక తప్పదు.

అందరికి తెలిసిన విషయాలనే శాస్త్రి ఏరి కూర్చుకొన్నాడని ఇంతకు ముందు నే నన్నప్ప

టికీ, మన సాహిత్యంతో, మన సంస్కృతితో, మన జాతీయ జీవితంతో సన్నిహిత సంబంధం కలవారికి మాత్రమే తప్ప అతను వ్రాసే విష యాలన్నీ పూర్తిగా తెలియవు. ఇంత చిన్న వయస్సులోనే ఇంత విషయ పరిజ్ఞానాన్ని శాస్త్రి గడించబట్టే రచయితగా అతనికి గొప్ప భవిష్యత్తు కలదని అనుకోవచ్చు. ఇప్పటికి ఈ మూడు పుస్తకాలతోనైనా శాస్త్రి సాధించిన విజయం సామాన్యమైంది కాదు. అతనికి నా ఆశీస్సులు.

"ఆంధ్రప్రభ"
మద్రాసు
22-4-54

# ఉద్దేశము:

"సామెతలు భాషలకు అమెతలు. అవి పెద్దలు లోకులకు చిందించిన అనుభవామృత బిందువులు." —శ్రీ వేటూరి శంకరశాస్త్రి

"సామెతలు ప్రసంగానికి కాంతి నిచ్చెడి దీపాలు."
—ఒక అరబ్బీ సామెత

"మానవుని జీవితచ్ఛాయలే సామెతలు." —శ్రీ గిడుగు సీతాపతి

* * * * *

ఇంతగా అమూల్యములని అభివర్ణితములగు ఈ సామెతలు అనగా ఏమి? వీనిని సృష్టించినవా రెవ్వరు? వీని ప్రయోజనము లేమి?—ఈ మొదలగు ప్రశ్నలకు జవాబులుగా మహా మహుల వాక్యాలనే ఇట పొందుపరచెద:

"లోకోక్తులను సామెతలంటున్నాము. వాటిలో మన తరతరాల అనుభవం సూత్రప్రాయంగా వుంటుంది. అవి ముఖ స్తమయి దేశమంతటా వ్యాపించే శక్తగల పదగుంభనతో కూడివుంటాయి. ముఖ్యంగా ప్రజల నైతిక జీవితా న్నుద్దేశించి చేయబడిన ప్రచారసూత్రాలే లోకోక్తులకు జీవికగా నుండేవని గ్రహించగలం.

సామెతలను ప్రత్యేకించి ఏ ఒక్క కవీ రచించిఉండలేదు. అవి ఒక్కరి సొత్తు కాదు. ఒక్కరి అనుభవము కాదు, ఆశయము కాదు. ఒక ప్రాంతానికిగాని కాలానికిగాని చెందేవికావు."

ఇవి—'పాడి పంటల' ప్రాచీన వాఙ్మయాన్ని తరిచి మథించి, 'రైతుసామెతల' సాహిత్యాన్ని వెలికి దీయుచున్న

శ్రీ గుమ్మలూరు సత్యనారాయణ, బి. ఎస్‌సి. (ఎజి.) గారు చెప్పిన మాటలు.

'ఈ మాటల సారాంశమునే బేకన్‌మహాశయుడు 'The genius, wit and spirit of a nation are discovered in its proverbs' అని క్లుప్తముగ వక్కాణించియున్నాడు. సామెత లక్షణాలను ఒక ఆంగ్లేయ కవిశేఖరుడు రెండేరెండు ముక్కలలో ఇట్లు నిర్వచించినాడు: 'Essentials of proverb are sense, shortness and salt.'

ఇట్టి ఈ సామెతల సంపద ప్రపంచములోని ప్రతిదేశము నకును అపారముగ కలదు. మాటవరుసకు - స్పెయిన్ దేశస్థులు, ఇటాలియన్లు మున్నగు నాగరికులు చక్కటి సామెతలను కొల్లలుగ సేకరించుకొనియున్నారు. స్పానియార్డుల సామెతలు ముప్పదివేలకు మించియుండునని అంచనా. జర్మనులకు లక్షసామెతలు వాడుకలో ఉన్నవన్న-చో, అది అలతివిషయము కాదు.

ఈ 'సామెతల' సాహిత్యవిషయములో అందఱును అన్నివిధాల శ్రద్ధ చూపుచున్నట్లు విన్నప్పుడు—సంస్కృతికి పేరొందిన మనము ఈ విషయములో ఏమి చేయగలిగితిమి? పోనీ, ఎంతవరకు కృషి సల్పితిమి?—అను ప్రశ్నలు వెను వెంటనె మనసున ఉదయించును.

ఇందులకు యుక్తియుక్తమైన ప్రత్యుత్తరము—సాహిత్య వీరుడు మన మహంకాళి శ్రీరామమూర్తి మాటలలో మనకు

లభ్యమగుచున్నది. మనసులో ఉన్నదియున్నట్లు, ఎంత సూటిగా నిష్కర్షగా నిష్కపటముగా ఆవేశపూరితముగ చెప్పుచున్నాడో చూడండి :

"ఏ జాతి అంతరంగమైనా దాని సామెతలలో ప్రతిఫలిస్తుంది.

సామెతలు ఒకరు సృష్టించినవికావు. ప్రజాహృదయంనుంచి ప్రయత్న రహితంగా అవి వెల్లుబ్బుతాయి. అందుచేత ప్రతి జాతి అంతరంగమూ దాని సామెతలలో ప్రతిఫలించడం సహజం.

అయితే—దాదాపు ఒకే అర్థంగల సామెతలు విభిన్న జాతులలో లేవా ?—లేకేమి ? ఎన్నో వున్నాయి. అయితే ఇందువల్ల ప్రతి జాతి ప్రత్యేకతనూ దాని సామెతలు ప్రస్ఫుటం చేస్తాయనే మూలసూత్రానికి భంగం లేదు.

ఒకే విధమైన సామెతలు విభిన్న జాతులలో ఉన్నవంటే, దాని తాత్పర్యం జాతీయ విభేదాలను మించిన ఒక ఐక్యత మానవకోటిలో ఉన్నదని మాత్రమే.

ఏ దేశానికి చెందిన మానవులైనా, ఏ జాతికి చెందిన మానవులైనా, వారందరి హృదయాలు సుఖదుఃఖానుభవాల స్పర్శకు ఒకే విధంగా స్పందిస్తాయి. ఒకే విధమైన ఈ అనుభూతి ఫలితంగా ఒకే భావం గల సామెతలు సృష్టికావడం సహజమే ;

ఏవో కొన్ని సామెతలు సమస్త జాతులకూ సమానంగా వున్నందువల్ల, సామెతలన్నీ ఒక్క మూసలో పోతపోయబడినవని భావిస్తే అది శుద్ధ పొరపాటు అని చెప్పక తప్పదు. నిజానికి, వివిధ జాతుల సామెతలమధ్య సామ్యంకంటే విభేదమే హెచ్చు.

మనలో విద్యాధికులైనవారు—ముఖ్యంగా పాశ్చాత్యవిద్య నభ్యసించినవారు—మన సామెతలపట్ల తగు శ్రద్ధను కనబరచడమే లేదు. వారికి అసలు సామెతలు రానే రావు. ఒకవేళ వచ్చినా, వాటిని సాధారణంగా ఉపయోగించరు. నిజానికి ఒక్కొక్క పట్టులో అప్పటికి తగిన సామెతను వాడితే, సంభాషణ ఎంతైనా రక్తి కడుతుంది. ఇంతేకాదు.

దీర్ఘంగా చెప్పవలసిన విషయం, దీర్ఘంగా చెప్పినా స్పష్టపడని విషయం, ఒక్క ముక్కలో తేలిపోతుంది! అసలు సామెతల ప్రత్యేకతే అది. తరతరా గతమైన అనుభవంద్వారా గడించబడిన పరిజ్ఞానం సూత్రప్రాయంగా యిముడ్చబడినదే సామెత.

ప్రతి సామెతకూడా ఏదో ఒక నిత్య సత్యాన్ని, లేదా ఒక జీవితానుభవాన్ని, లేదా ఒక ప్రకృతి రహస్యాన్ని తనలో గర్భితం చేసుకొని, సూత్రప్రాయంగా ఒక హెచ్చరికను చేస్తుంది. లేదా, ఒక గుణపాఠాన్ని బోధిస్తుంది. లేదా, ఒక సంశయాన్ని తీరుస్తుంది. అందువల్ల సంభాషణను ఈ సామెతలు ఎంతైనా రక్తికట్టించగలవు.

మన పాటకపు జనుల సంభాషణ ఎంతో జాతీయంగా, వన్నెచిన్నెల పూర్వకంగా, రసవత్తరంగా వుండడానికేమి, మన విద్యాధికుల సంభాషణ అటు ఇంగ్లీషు - ఇటు తెలుగు - ఏదీ కాని పాడుభాషలో పేలవంగా వుండడానికేమి, ఇదే కారణం.

అయిదు నిమిషాలు మాట్లాడితే చాలు, పాటకపుజనం అయిదు సామెతలను ఉపయోగిస్తారు. అయిదు గంటలు మాట్లాడినా, పాశ్చాత్య విద్యాపారంగతులకు ఒక్క సామెతైనా దొర్లదు.

ఇప్పటి ఈ పరిస్థితిలో మార్పు రావలెనంటే - మన సామెతలు, తద్వారా మన తెలుగుతనం నశించకుండా వుండాలంటే - మన పాఠశాలలలో ప్రత్యేకంగా సామెతలు నేర్పడం అవసరం."

ఇప్పటికి పదేండ్లక్రిందట చెప్పిన మాట లివి. అనగా___ ఆనాటికే, సామెతల సాహిత్యమును సేకరించి, గ్రంథస్థ మొనరిచి ప్రచారమునకు తెచ్చు విషయమున తెనుగునాడు ఎంతటి ఉదాసీనభావముతో నుండెనో తెల్లమగుచునే యున్నది.

ఐనను, ఆంధ్రభాషాభిమానులు కేవలము ఇందును గురించి ఉపేక్షించినారనుట పొరపాటు. ఇవ్విషయమున ఉత్సా

హాము సమసిపోలేదనుటకు నిదర్శనముగ ఏలూరులో ఒకరు, రాజమహేంద్రవరమున ఒకరు, మదరాసునగరమున ఒకరు, కొన్ని కొన్ని తెలుగు సామెతలను ఏర్చి కూర్చి, చిన్న పుస్తకాలుగా ప్రకటించియున్నారు. వీని యన్నిటిలో వావిళ్లవారు ప్రకటించిన పుస్తకముమట్టుకు అత్యంతము ఉపయుక్తమైన దనుట అత్యుక్తి కానేరదు.

ఈ పుస్తకాల మాట అటుంచి, 'గృహలక్ష్మి' మొదలైన పత్రికలు కొన్ని ప్రతి సంచికలోను ఒకటో రెండో పుటలు కేటాయించి, సామెతలు ప్రకటించుటలో వినియోగించుచు వచ్చినవి. ఈ ప్రయత్నములో గల ప్రయోజన మేమో తెలియ రాదు. ఇటు లనుటకు కారణము—వానిలో, పుస్తకాలలో ఉన్నకంటె అదనపు సామెతలు ఏమియు కానరాకుండుటయే.

ఇది యిట్లుండ—పాతపాటలు, మాండలికములతో పాటు తెనుగుసామెతలుకూడ అపారముగ ప్రోగుచేసి, కృషి చేయుచున్నవారిలో శ్రీయుతులు నేదునూరి గంగాధరము, నాళం కృష్ణారావు, టేకుమళ్ల కామేశ్వరరావుగారల నామధేయములు తరుచు పత్రికలలో కనబడుచునేయున్నవి.

కొన్నాళ్లక్రిందట—పరిశోధక చక్రవర్తులయిన డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు ఈ విషయమున శ్రద్ధ వహింప దలచి, "లక్ష సామెతలను సేకరించి ప్రకటించబోతున్నాను, ఇందుకు సాహిత్యప్రియు లందరూ తోడుపడండి!" అని

పత్రికలలో ప్రకటించినారు. ఈ మహాత్కార్యము రూపొందక ముందే ఆ మహాశయుడు మనల వీడిపోవుట మన దురదృష్టమే.

ఆంధ్రాభిమానులు ఎందరెన్ని విధాలుగా కృషిసల్పి నప్పటికిని, మనకు గ్రంథస్థములయియున్న సామెతలు వేల సంఖ్యకుసైతము రానట్టు తోచుచున్నది. నారాయణరావు గారు సంకల్పించిన "లక్ష సామెతలు" సేకరించవలెనను ఆంధ్రుల వ్రత మేనాటికైనను ఫలోన్ముఖమునకు రాగలదా ?

లేకేమి !—ఇందుకు ప్రత్యుత్తరము శ్రీరామమూర్తిగా రిచ్చిన మేటి హితవేనని నా యుద్దేశము.

*　　*　　*　　*

ఈ విషయమున ఇటీవల జరుగుచున్న కృషి నించుక గమనించితిమేని, సామెతల సేకరణకయి మనము చేయవలసిన పనిని అతి శీఘ్రకాలములో చేసితీరగల్గుదుమను నిబ్బరము నాకు పూర్తిగా కలదు.

మిత్రులు గుమ్మలూరు సత్యనారాయణగారు ప్రాచీన కావ్యాలను, ప్రబంధములను గాలించి, రైతుసామెతల దృష్ట్యా పరిశోధనలు సల్పి, పసందైన ఫలితాలను ఆంధ్రావనికి అందిచ్చు చున్నారు.

ఇందుకు తోడు—అంబటిపూడి సీతారామశాస్త్రిగారు వైద్యశాస్త్రదృష్ట్యా సామెతలను సేకరించి, అప్పుడు పుట్టిన శిశువునకుసైతము అర్థమగు తీరున వివరణలు వ్రాసి, క్రమముగ 'ధన్వంతరి' పత్రికలో ప్రకటించుచున్నారు.

ఇట్లు, దిగ్గజములవంటి ఇరువురు భాషావేత్తలు, చెరి యొక దృష్టితో మన వాఙ్మయమును మథించి, సామెతల సారమును అందించుటచే మన తెలుగుతల్లికి ప్రశంసనీయమగు సేవ చేసినవారగుచున్నారు. ఈ మహామహుల కృషి శుభసమయాన ప్రారంభమై, భాషాభిమానులందరను మేల్కొలుపుచున్నదనుట కించుకేని సందియము లేదు.

ఇదే విధముగ సర్వ సమర్థులగు ప్రతిభావంతులు సావకాశము చేసికొని పూనుకొన్నచో ఆంధ్రభాషామ తల్లికి ఇంకను ఎన్నియొ మెఱుగులు దిద్దవచ్చును. ఒక్కొక్కరు ఒక్కొక్క దృష్టితో పని చేయుటచే—ఒక శబ్దకోశమునకు, ఒక గొప్ప విజ్ఞాన సర్వస్వమునకు, ఒక మహా నిఘంటువునకు ఒక్కొక్క అంగము పూర్తిచేసి, నిర్మాణమునకు తోడుపడినవారగుదురు.

ఈ మహత్కార్యమును సాధించుటకు ఉత్సాహవంతులు, విద్యావంతులు అగువారు కొలదిమంది యుండిన చాలును. కాని, వారికి, తమ కార్యభారమును గుర్తెఱిగి శ్రద్ధతో నిరంతరము పరిశ్రమ చేయవలెనను దీక్ష యుండుట మాత్రము అత్యంతవసరము.

* * * *

దివ్యమైనటువంటి ఈ సామెతల సాహిత్యము నన్నెంతయో నాకర్షించినది. ఒకనాటి నా సారస్వత జిజ్ఞాస సామెతల

మీదికి ఉరకలెత్తి, నక్కను గుఱించిన నాలుగు సామెతలు మన సున తళుకుక్కుమన్నవి. లోతుగ యోచించుసరికి ఆ నాలుగు సామెతలును సంఖ్యలో పెరుగసాగినవి. ఆ సామెతలకు కొన్ని జాతీయములు వచ్చి జతపడినవి. ఇంకను యోచించగా, ఈ సామెతలకు గల మహత్తర బోధనశక్తి మనసునకు తట్టినది.

నా అన్వేషణ నలుముఖాలకు చెదరినది. ఈ సాధన సామగ్రితో ఒకచిన్నవ్యాసమును అల్లి 'మాతృసేవ'కు పంపితిని. తదధిపతులు శ్రీధరరావుగారు దీనిని మెచ్చుకొనుచు, ప్రోత్స హించిరి.

దీక్షతో వరుసగా, ఏనుగ కుక్క పిల్లి గుఱ్ఱము గాడిద ఆవు ఎద్దు కోతి మేక గొఱ్ఱె ఎలుక సింహము దున్న బఱ్ఱె— మొదలగు కొన్ని జంతువులగూర్చి కూలంకషమయిన సాహిత్య వినోదములు, విజ్ఞాన విషయములు దొరకినంతవఱకు పర్చికూర్చి, 'మాతృసేవ'కు మాలికలుగ సమర్పించితిని.

ఈ వ్యాసరచనా విషయమున నన్నపుడపుడు పురికొల్పు చుండిన నా హితైషులు విద్వాన్ శ్రీ వేదము వేంకటకృష్ణ శర్మగారికిని, శ్రీ ఆంద్ర శేషగిరిరావు బి. ఎ.,గారికిని నా కృతజ్ఞత తెలుపుకొనుచున్నాను.

1-12-'53. —శాస్త్రి



# సాహిత్యంలో 'ఏనుగు'

మాతృదేవత తన బిడ్డకు ఉగ్గుపాలతోనే ఏనుగును పరిచయం చేస్తున్నది. బిడ్డకు ఉగ్గు పట్టగానే—

జీర్ణం జీర్ణం - వాతాపి జీర్ణం
గుర్రాలు తిన్న గుగ్గిళ్లు జీర్ణం
ఏనుగు తిన్న వెలక్కాయలు జీర్ణం
ఏనుగంత సత్తువిచ్చి - గుర్రమంత పరుగిచ్చి...

కాచి రక్షించుమని దైవాన్ని కోరుకొంటుంది.

ఉగ్గుపాలతో జీర్ణించుకున్న బిడ్డ పెరిగి పెద్దదవుతున్న కొద్దీ ఏనుగును గురించి ఆడుకోవటంలోనూ పాడుకోవటంలోనూ ఆశ్చర్య మేమున్నదీ!

ఏను గొచ్చిందేనుగు
మా వూరొచ్చిందేనుగు
మంచినీళ్లు తాగిందేనుగు...

అంటూ ఈ విధంగా ఏనుగు చేసిన చేష్టలను ఎంతో ఆనందంతో ముచ్చటించుకొంటారు పసిపాపలు. చిన్నపిల్లలు కొంతమంది చిన్నారిమాటలతో కవిత్వం కట్టి

ఏనుగు ఏనుగు నల్లన
ఏనుగు కొమ్ములు తెల్లన
ఏనుగుమీదా రాముడూ!
ఎంతో చక్కని దేముడూ!

అని చెప్పి దాని ఆకారం వర్ణిస్తారు. కాస్తంత స్థూలకాయులు దారంట పోతూవుంటే 'ఏనుగుగున్నలాగా ఉన్నాడురా' అని పరియాచకం చేస్తారు. ఏనుగు ఆకృతి చాలా ఘనమైనది. శరీరమే గాదు. దాని గుణాలూ ఘనమైనవే.

ఏనుగు ఘనత ఒక్కవిధమైంది మాత్రమే కాదు. దాని విలువ ఇంతటిదీ అని చెప్పతరంకాదు. అందుకనే 'ఏనుగు చచ్చీ వెయ్యి, బ్రతికీ వెయ్యి' అంటారు.

మన దేశంలో ఏనుగు ప్రాముఖ్యత పురాణకాలంనించీ వస్తున్నది. విశ్వామిత్రుడు యాగం తలపెట్టి, హరిశ్చంద్రుడి వద్దకు వచ్చి ద్రవ్యసహాయం కోరాడు. ఎంత కావాలో కోరుకోమన్నాడు చక్రవర్తి. అప్పుడు విశ్వామిత్రుడు ఇలా

కోరుకున్నాడు: ఒక ఏనుగుమీద ఎక్కి నించుని, వజ్రం పైకి విసిరితే ఎంత ఎత్తుకు ఎగురుతుందో అంత ధనం కావాలని.

భాగవతంలో 'గజేంద్రమోక్షం' కథ, వినాయకుడికి ఏనుగుతలకాయ తెచ్చి తగిలించిన కథ అందరికీ తెలిసినవే.

రెండువైపులా రెండు ఏనుగులు తొండములతో పూల దండలు పట్టుకు నించునివుండగా కనబడే లక్ష్మీదేవిని 'గజలక్ష్మి' అంటారు.

ఇంద్రజాలంలో గజకర్ణ, గోకర్ణ విద్యలు అనేవి వున్నాయి.

గొప్పతనం తెలుపవలసిన ప్రతి సందర్భంలోనూ 'గజ' శబ్దం వినియోగపడుతూనేవుంది. చూడండి: గజయీతగాడు-గజదొంగ, గజనిమ్మ - ఇలాంటి మాటలు. అంతేకాదు. ఏనుగు పోలికకు సంబంధించిన మాటలు మరికొన్ని వున్నాయి: గజకర్ణము, గజగమన, గజదంతము, గజయాన, గజాననుడు - మొదలైనవి.

ఒకానొక విద్యలో ఘనత సంపాదించిన ప్రవీణుని 'దిగ్గజం' అని పిలుస్తారు. మన సారస్వతంలో అష్టదిగ్గజాలున్నట్లు విశదమవుతున్నది.

అటువంటి అష్టదిగ్గజాలలో ఒకడు అల్లసాని పెద్దన. తనకు ప్రభువు, పోషకుడు ఐన శ్రీకృష్ణదేవరాయలు నిర్యాణం చెందినప్పుడు ఆయన తనకు చేసిన గౌరవాన్ని ఇలా గొప్పగా చెప్పుకొన్నాడు:

'ఎదురైనచో దన మదకరీంద్రము నిల్పి
కేలూత యొసగి యెక్కించుకొనియె'

ఈ సందర్భంలో కవులను గురించి ఒక్కమాట చెప్పాలి. పూర్వకాలమందూ ఈనాడూకూడా 'గజారోహణోత్సవం' చేసి కవికుమారులను సన్మానించడం జరుగుతూనేవుంది. కవికి జీవితంలో ఇంతకంటె గొప్ప గౌరవం ఉండబోదు.

కొంతమంది వ్యక్తులు 'ఎవ్వరేమనుకొన్న నాకేమి కొదవ!' అన్నట్టుగా వ్యవహరిస్తారు. అనగా ఒకరి లక్ష్యం వారికి లేదన్నమాట. వాళ్ళు లోకులనుగురించి 'ఏనుగు పోతూంటే కుక్కలు మొరుక్కుంటాయి' అనుకుంటారు. ముఖ్యంగా రాజకీయరంగంలో ఇలా ఉదాసీనంగా వుంటేగాని వారికి క్షణం గడవదు.

'కరి మింగిన వెలగపండు' అన్నాడు సుమతీశతకకర్త. ఇది చాలా విచిత్రమైన విషయం. ఏనుగు వెలగపళ్ళు మింగి వేస్తుంది. మింగినవి మింగినట్టే ఉంటాయి చెక్కుచెదరక. లోపల చూస్తే గుంజుమట్టుకు మాయమైవుంటుంది. ఆలోచించి చూడగా ఇది నిజానికి ఇంద్రజాలమా అనిపిస్తుంది.

ఐతే బ్రహ్మాండమైన ఏనుగెక్కడ? దాని ఆకలి తీర్చటానికి చిన్నచిన్న వెలక్కాయ లెక్కడ?—అందుకనే 'ఏనుగకు వెలక్కాయలు లొటలొట' అనే సామెత పుట్టింది. ఇది ఏనుగు ఆకలికి సంబంధించిన సామెత. ఆలాగే ఏనుగు దాహం విషయంలోకూడా ఒక సామెత వుంది. అదే 'ఏనుగు దాహానికి చూరునీళ్లా?' అనేది.

ఏనుగు ఆకలినిగురించీ దాహాన్నిగురించీ ఇలా చెప్పుకొంటూవుండగా దాని పెంపకం విషయంకూడా కష్టసాధ్యమనే సంగతి ఋజువు చేయడానికీ ఒక సామెత వుంది :

'ఏనుగుకు ఒకసీమ, గుర్రానికి ఒకఊరు, బర్రెకు ఒక బానిస'

ప్రకృతిలో ఏనుగకూ సింహానికీ సంబంధమున్నది. ఏనుగు కన్నుమూస్తే సింహం కలలో కనబడుతుందట. 'సింహస్వప్నం' వస్తుందనే భయంచేతనే అది ఎన్నడూ నిద్రపోదని ఒక నమ్మిక.

మరొకటేమిటంటే - సింహం ఏనుగుపైన ఉరికి, దాని కుంభస్థలమే ఆరగిస్తుందట! దీన్నిబట్టే, పౌరుషవంతులు సామాన్యంగా 'కొడితే ఏనుగు కుంభస్థలమే కొట్టాలి' అని అంటూ వుండటం కద్దు.

ఏనుగు తినే తిండీ అలాంటిదే. దానికి తగినట్టు అది చేసే పనీ అలాంటిదే. దీనినే 'ఏనుగు మేత, ఏనుగు మోత' అంటారు.

బ్రహ్మాండమైన ఏనుగకూ కంటికి కనబడని చిన్న దోమకూ కలిపి సామరస్యం తెలిపే సందర్భాలున్నాయి. 'ఏనుగకు కాలు విరగటం, దోమకి రెక్క విరగటం ఒకటే' అని.

నిజానికి ఏను గెక్కడ? దోమ ఎక్కడ? దీనినిబట్టే వ్యత్యాసము నిరూపించవలసి వచ్చినప్పుడు 'హస్తి మశకాంతరం' అనే జాతీయం అమలులోకి వచ్చింది.

రాయలవారి కాలంలో భట్టుమూర్తి ఒక సమస్య ఇచ్చాడు : 'కుంజరయూథంబు దోమ కుత్తుక జొచ్చెన్' అని. దీనిని తెనాలి రామకృష్ణుడు చమత్కారంగా ఇలా పూరించి బహుమతి పొందాడు :

'రంజన చెడి పాండవు లరి
భంజనులై విరటు గొల్వ పాల్పడి రకటా!
సంజయ! విధి నేమందును
కుంజరయూథంబు దోమకుత్తుక జొచ్చెన్'

ఇటువంటిదే మరిఒక సమస్యకూడా, వాడుకలో ఉంటున్నది: 'ఎలుకలు తమ కలుగులోని కేనుగు నీడ్చెన్' అనేది. ఇది చదరంగపు ఆటకు సంబంధించింది. దీనిని కవి ఎలా పూర్తి చేశాడో చూడండి:

'ఇలలో నిద్దఱు రాజులు
మలయుచు జదరంగమాడి మాపటివేళన్
బలమెత్తి కట్టమఱచిన
నెలుకలు తమ కలుగులోని కేనుగు నీడ్చెన్'

'మహాగజా పలాయంతే మశకానాంతు కాగతిః!' అని ఒక సంస్కృత లోకోక్తి. అంటే గొప్పగొప్ప ఏనుగులే పారిపోతూవుంటే ఇక దోమల మాట చెప్పేదేమిటి?—అని భావం.

ఈ సందర్భంలోనే అడిదం సూరకవి చెప్పిన పద్యం:

"సామజము చెఱకు మేసిన
దోమలు పదివేలు చేరి త్రోలంగలవా?
గ్రామపతి తగవు తప్పిన
గ్రామములో నున్నవారు కాదనగలరా"

పిల్లలకు కళ్ళు చిన్నవిగా ఉంటే 'ఏనుగుకళ్ళు' అంటారు.

స్త్రీలు ఏడేళ్ళకు గర్భం ధరించినట్లయితే 'ఏనుగుకాన్పు' అంటారు. ఏనుగు ఏడేళ్ళ కొకసారి చూలు కట్టడమే ఈ పోలికకు కారణమై ఉండవచ్చు.

ఎవళ్ళయినా తమ తాహతు మించి సంచరిస్తే, 'ఏమి టోయి, ఏనుగువేషం, గాడిద కూతాను!' అని మందలిస్తారు.

కవిత్వంలో గజగమనాన్ని గురించి చెప్పవలసివచ్చినప్పుడు 'మత్తేభవృత్తం' వేస్కోనాలి. మచ్చుకి 'గజేంద్రమోక్షం'నుంచి:

'అలవైకుంఠపురంబులో నగరిలో నామూల సౌధంబు దా
పల మందార వనాంతర మృతసరః ప్రాంతేందు కాంతోపలో
త్పలపర్యంక రమావినోదియగు నాపన్న ప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము పాహిపాహి యనఁ గుయ్యాలించి సంరంభియై'

ఘనమైన ఏనుగు నామాంతరాలలో కొన్ని ఇవి: గజము, కుంజరము, సామజము, కరి, హస్తి, ఇభము, (మత్తేభము), దంతావలము, ద్విరదము, వారణము, అనేకపము, ద్విపము, నాగము, పద్మి, మతఙ్గజము, స్తంబేరము.

ఇంతటి బ్రహ్మాండమైన ఏనుగా మావటివా డుపయో గించే మూరెడు అంకుశానికి లొంగిపోతుంది, అదేం చిత్రమో!

అందుకనే 'ఎక్కినవాడికి ఏనుగు లొజ్జు' అనే సామెత ఏర్పడింది. దీన్నే ఒక పూర్వకవి చాటువుగా చెప్పాడు ఇలా:

"అంకుశంబెంత! వశమగు హస్తి యెంత!
వజ్రమెంత! భిన్నమగు పర్వత మదెంత!
దీపమెంత! తొలగిపోవు తిమిరమెంత!
వెలయునది తేజమేగాని బలుపు గాదు"

దీనినే భాస్కరశతకకర్త కూడా ఇలా చెప్పాడు:

'చక్కఁ దలంపగా విధివశంబున నల్పునిచేతనైనఁ దాఁ
జిక్కి యవస్థలం బొరలుఁ జెప్పగరాని మహా బలాఢ్యుడున్
మిక్కిలి సత్త్వ సంపదల మీఱిన గంధగజంబు మావటీఁ
డెక్కి యదల్చి కొట్టి కుదియించిన నుండదె యోర్చి భాస్కరా!'

'హస్తి' అనగానే 'కాళహస్తి' జ్ఞాపకానికి వస్తుంది. కాళహస్తి గాథ శివభక్తిపరురాలయిన ఏనుగును గురించి అతి రమ్యంగా విశదీకరిస్తుంది. అయితే, హస్తినాపురానికీ, ఏనుగుకూ ఏమీ సంబంధం లేదనే చెప్పాలి. అది హస్తి అనే వ్యక్తిపేరిట నిర్మించబడింది.

'వల్లీ కల్యాణం'లో విఘ్నేశ్వరుడు ఒక భయంకరమయిన ఏనుగు ఆకారం దాలుస్తాడు.

శ్రీకృష్ణ బలరాములను పరిమార్చటానికి 'కువలయాపీడన'మనే ఏనుగును వదిలాడు కంసుడు.

ధర్మరాజంతటివాడు అబద్ధమాడిన ఘట్టం మహాభారతంలో వుంది. 'అశ్వత్థామ హతః కుంజరః' అనే వాక్యం వింత గొలిపే ఈ యితిహాసాన్ని వెల్లడిస్తుంది.

ఏనుగును గురించి అరవంలో కొన్ని చిత్రమైన సామెతలున్నాయి :

'ఆనై తన్ తలయిల్ తానే మణ్ణై పోట్టు కొళ్ళుమ్' అనగా—ఏనుగు తన తలమీద తనే మన్ను పోసుకుంటుందని అర్థం. తన గొయ్యి తానే తీసుకోవటమని దీని భావం.

'ఆనైక్కు ఒరుకాలం వందాళ్
పూనైక్కుం ఒరుకాలం వరుం'

అని మరొకటి. ఏనుగుకు ఒకకాలం వస్తే, పిల్లికీ ఒకకాలం వస్తుంది అని దీని అర్థం. అంటే ఎల్లప్పుడూ బలవంతులకే ఆనుకూల్యం జరగదు. అల్పజంతువులు సైతం వాటి హాయామ

చెలాయించగల ఒక అవకాశం దొరికే తీరుతుంది. కాగా, పెద్దవాళ్లమని గర్వం పనికిరాదని చెపుతోంది ఈ సామెత.

పోతే — 'ఏనుగు మదానికి వాళ త్తండు
మనుషుల మదానికి కీర త్తండు'

అని తమిళనాట ఒక వైద్యసామెత అమలులో వుంటోంది. ఇందులో మదపుటేనుగుల మదం అణచటానికి ఒక ప్రక్రియ పేర్కొనబడుతోంది. 'అరటిదవ్వ (దూట) పెడితే మదపు టేనుగుల మదం అణగిపోతుంది. అలాగే తోటకూర తింటే మనుష్యుల మదం (వేడి, మోహం) మొదలైనవి ఉపశమిస్తాయి'.

ఏనుగును గురించిన మరికొన్ని సామెతలు :

'గజకచ్ఛప పోరు చందము'

'ఏనుగుపాడి'

'ఏనుగు పడుకొన్నా గుర్రమంత యెత్తు'

'మిట్టను వున్నా యేనుగే : పల్లాన వున్నా యేనుగే'

'బ్రాహ్మడి చెయ్యీ, యేనుగు తొండమూ వూర కుండవు'

'ఏనుగులు తినేవాడికి పీనుగులు పిండివంటవస్తు'

'ఏనుగుల పోట్లాటకు ఏట్రంత రాయబారం'

'వెయ్యి వరహాలు పెట్టి యేనుగను కొనుక్కొని అర వీసం అంకుశానికి పాలుమాలునా ?'

'ఏనుగను తెచ్చి యేకులబుట్టలో వుంచి అది తన నెత్తిన పెట్టి తిన్నా యెత్తుకోమన్నట్టు'

'ఏనుగ నెక్కినవాడు కుక్కకూతకు జడియడు'

2

గీర్వాణ సాహిత్యంనుంచి కొన్ని లోకోక్తులు :

ఏనుగు చాలాసేపు నీటిలో వుండి చక్కగా స్నానం చేస్తుంది. అయితే ఏం ప్రయోజనం? ఒడ్డుకు రాగానే తొండంతో ధూళీ దుమ్మూ తీసి మీద పోసుకుంటుంది. ఒక మంచిపని చేసి తరవాత దానిని పాడుచేసుకొనేవాళ్ళకు ఈ న్యాయం వర్తిస్తుంది. దీనినే 'కుంజర స్నాన న్యాయం' అంటారు.

నమ్మరాని డంబాలుకొట్టేవారిని గురించి 'అంగుల్యాగ్రే కరిణాం శతమ్' అనే లోకోక్తి వాడుతారు. అంటే నా వేలి చివరతో నూరు ఏనుగులను ఎత్తానని చెప్పడం.

'మనో ధావతి సర్వత్ర మదోన్మత్త గజేంద్రవత్' అని మరొకటి. మదించి పిచ్చిపట్టిన ఏనుగులాగ మనస్సుకూడా అన్ని దిక్కులకూ పరుగెత్తుతుంది అని చెపుతూంది ఈ సామెత.

పెద్దదానిలో చిన్నవస్తువు ఇమిడిఉన్న సందర్భంతో 'సర్వం పదం హస్తి పదే నిమగ్నమ్' అంటారు. అనగా చిన్న జంతువుల అడుగుజాడలు ఘనమైన ఏనుగుయొక్క కాలిజాడలో ఇమిడిఉన్నట్లు.

ఒక పెద్ద వస్తువును జారవిడుచుకొని చిన్నవస్తువుకోసం గ్రుద్దులాడుకొనేవారిని 'విక్రీతే కరిణి కిమంకుశే వివాదః' అని మందలిస్తారు. 'ఏనుగును అమ్మివేసినపిమ్మట అంకుశంకోసం దెబ్బలాడుకోవట మెందుకు?' అని.

గ్రుడ్డివాళ్లు కొంతమంది ఏనుగు ఎలా ఉంటుందో తెలుసుకుందామనుకొన్నారు. ఒకడు వారిని తీసుకువెళ్లి ఏనుగుదగ్గర విడిచిపెట్టాడు. గ్రుడ్డివాళ్ళు ఒక్కొక్కడు ఒక్కొక్క అవయవం తడవిచూచి ఇలా అనుకున్నారు :

చెవులు దొరికినవాడు చేటలా ఉందని, తొండము తడ వినవాడు పాములా ఉన్నదనీ, కాలుపట్టుకొన్నవాడు స్తంభాన్ని పోలివుందనీ, తోక చేతపట్టినవాడు ఏనుగు త్రాడులా ఉందనిన్నీ. ఈ విధంగా మిడిమిడిజ్ఞానం గల మూఢులు ఏవో నాలుగు శ్లోకాలు నేర్చుకుని తాము సర్వజ్ఞుల మనుకొంటారు. దీనికే 'అంధగజ న్యాయం' అని పేరు.

చెన్నపట్నంలో 'ఆనై గవని' వున్నది. 'గవని' అంటే గేటు. పూర్వం ఈ గేటుద్వారా ఏనుగులు వస్తూ పోతూ ఉండేవిట.

మన దేశంలో పడమటి కనుమల ప్రాంతంలో ఏనుగులు విస్తారం. 'ఆనై' అంటే ఏనుగు, 'మలై' అనగా కొండ. ఏనుగులు ఎక్కువ గల కొండలు గనుక ఆ ప్రాంతానికి 'ఆనై మలై' అనే వాడుక వచ్చింది.

వంగదేశంలో 'నవకుంజరం' అనే గొప్ప ఉత్సవం జరుగుతుంది. అనగా తొమ్మిదిమంది కలిసి ఏనుగు స్వరూపం వచ్చేటట్లు ఒక చిత్రమైన బంధనం వేస్తారు. నిజానికి, ఇది చూడని నేత్రాలు నేత్రాలే కావు.

ఇప్పుడు బొంబాయిదగ్గర ఉన్న 'ఎలిఫెంటా' అనేది ఒక ద్వీపం. ఈ దీవ్వానికి దక్షిణ తీరాన బ్రహ్మాండమైన ఏనుగుయొక్క శిలాప్రతిమ వుండటంచేత పోర్చుగీసువారు 'ఎలిఫెంటా' అని నామకరణం చేశారు.

వేదకాలంనాటినుంచీ కూడా ఏనుగుల విషయంలో ఒక సంప్రదాయం వస్తున్నది. ఏనుగులకు విశిష్టమైన జ్ఞానమున్నది.

అది యేమిటీ అంటే- రాజలక్షణాలు గల వ్యక్తిని గుర్తించే శక్తి దాని కొక్కదానికే వున్నది. అందుకనే, గద్దె ఎక్కవలసిన రాజకుమారు లున్నప్పుడు ఒక పూలమాల ఏనుగుకు అందిచ్చేవారు. అది తన తొండంతో ఆ మాల పట్టుకువెళ్ళి రాజ్యార్హుడైన వాడెవరో సరిగా వాని మెడలో వేస్తుంది. దీన్నిబట్టి చూడగా, ప్రభువులకు పట్టంకట్టే శక్తి సామర్థ్యాలు ఏనుగుకు ఉన్నవని తెలుస్తున్నది. ఏనుగు అంచనా ఎన్నడూ తప్పిపోదని చెప్పడానికి నిదర్శనాలు కూడా వున్నాయి.

అయితే—పట్టంకట్టిన ఆ యేనుగలే రణరంగమందు ప్రభువుల్ని పరిమార్చిన ఘట్టాలు చరిత్ర తిరగవేస్తే వందలూ వేలూ కనబడతాయి.

మచ్చుకి: అలెగ్జాండరుకి పురుషోత్తముడికి జరిగిన యుద్ధంలో పురుషోత్తముడు ఏనుగులమీద ఎత్తి వెళ్ళాడు. గ్రీకులు ఆ ఏనుగుల్ని బాణాలతో కొట్టారు; వాటి కాళ్ళు గొడ్డళ్ళతో నరికివేశారు, గందరగోళం బయలుదేరింది. ఏనుగులకి కంగారెత్తింది. అవి స్వ పరపక్ష భేదం లేకుండా తొక్కి పారేశాయి. పురుషోత్తముడి సైనికులు చెల్లాచెదరై పోయారు. అతనికి ఓటమి కలిగింది.

ఇలానే క్రీ. పూ. 712 లో రాజా దహీర్ అనే హిందూ రాజుకీ, అరబ్బీనాయకుడు మీరా్ ఖాసింకీ మధ్యని చెలరేగిన యుద్ధంలో అరబ్బులు 'నాఫ్తా' పూసిన బాణాలు వదిలేటప్పటికి రాజా దహీర్ ఏనుగులు భరించలేక పరుగెత్తినయి. ఆ సందిట్లో రాజా సైన్యం పలాయనమైంది. అరబ్బులకి విజయం చేకూరింది.

ఇదే మోస్తరుగా రెండవ పానిపట్టు యుద్ధంలోనూ తాలికోట యుద్ధంలోనూ ఏనుగులవల్ల ఓటమి సంభవించింది. రాజపుత్రుల యుద్ధాలలో కూడా ఇటువంటి సంఘటనలెన్నో కనబడుతాయి. ఇలా ఏనుగులను యుద్ధంలో ఉపయోగించి ఎత్తిరిల్లినవాళ్ళు అరుదని చరిత్రలు చెప్పుతున్నాయి.

అక్బరుచక్రవర్తికి ఏనుగులంటే మహాప్రీతి. అతడు గొప్ప ఏనుగుల బలగాన్ని పోషిస్తూ వుండేవాడు. అలాగే జహాంగీరుకూడా. ఆయనకు పట్టపుటేనుగులు తలలు వంచి, తొండాలెత్తి గౌరవం చూపేవిట. చక్రవర్తి జన్మదినోత్సవం నాడు ఈ ఏనుగులు ఆభరణాలు, నవరత్నాలు, పట్టుబట్టలు, ముఖమల్ దుస్తులు, ధ్వజాలు, పతాకాలు—ఈ అన్నిటితో అతివైభవంగా అలంకరింపబడేవి. ఈనాడూ మైసూరు దసరా ఉత్సవాలలో ఏనుగుల వైభవం కనువిందువుగా చూడవచ్చు.

మొగలుల కాలంలో ఏనుగులకు దిట్టమైన బరువులు వేసి దూరదేశ ప్రయాణాలకు ఉపయోగించేవారు. మొగలు చక్రవర్తులకు 'ఏనుగుల పందెములు' కట్టించడం చాలా వేడుకగా ఉండేది. ఐతే, ఈ వినోదాలు చూడటానికి భయంకరంగానూ, క్రూరంగానూ ఉండేవి.

పురాణకాలమందు ఏనుగులను క్రూరచర్యలు ఆచరించటానికి వినియోగించేవారని తెలుస్తుంది. తండ్రిని ధిక్కరించిన ప్రహ్లాదుణ్ని ఏనుగులచేత తొక్కించినట్టు భాగవతమే చెబుతున్నది.

ఒకప్పుడు కోపగించి రాయలవారుకూడా తెనాలి

రాముడికి ఏనుగులకింద వేసి తొక్కించే శిక్ష విధించారు. ఐతే అతడు యుక్తిపరుడు కనుక ఈ శిక్ష తప్పించుకో గలిగాడు.

ఏనుగులచేత తొక్కించడం, ఏనుగులకి పడవేసి చంపించటం—ఇలాంటి క్రూరశిక్షలు విజయనగరరాజుల కాలంలోనే కాదు కొందరు మొగల్ చక్రవర్తులచేత, సింహాళ రాజుల చేతకూడా విధించబడుతూ వుండేవి.

ఏనుగు స్వభావం ఒక్కముక్కలో చెప్పాలంటే—అది పొందిన ఏపాటి చిన్న ఉపకారమూ మరువదు. దానికి కలిగిన చిన్న అపకారమూ మరచిపోదు. ఏనుగు తనకు మేలు చేసిన వారికి కృతజ్ఞతను చూపి ఋణం తీర్చుకున్న కథలూ, కీడు చేసినవారికి తగినట్టుగా శాస్తి చేసిన కథలూ మన సారస్వతంలో కొల్లలుగా కనబడుతున్నాయి.

దేవేంద్రుడి వాహనం ఐరావతం తెల్లగా వుంటుందని మనకు తెలుసు. అంటే తెల్లఏనుగ అనేది ఒక్క స్వర్గలోకంలోనే ఉన్నదని చాలామంది అనుకుంటారు. కాని నిజానికి, తెల్ల ఏనుగలు భూలోకమందూ ఉన్నాయి. మానవమాత్రులుకూడా వాటిని కళ్లవేడుకగా చూడనూవచ్చు. తెల్లఏనుగుల చరిత్ర చెపితే తెల్లబోవలసి వస్తుంది.

"తెల్లఏనుగులకు పుట్టినిల్లు" సయాందేశం. ప్రపంచంలోకల్లా ఒక్క సయాందేశపు అడవులలోనే తెల్లఏనుగులు కనిపిస్తాయి. ఆ దేశపు నిత్యజీవితంలో మరి ఏ ఇతర జంతువూ ఈ తెల్లఏనుగలంత ప్రాముఖ్యాన్ని పొందలేదు.

ఆ దేశస్థులు తెల్లఏనుగను ఎంతగా గౌరవించి పూజిస్తూ

వుండేవారో రెండు మాటల్లో చెప్పవచ్చు. దేశాన్ని పరిపాలించి చనిపోయిన తమ రాజుల ఆత్మలు తెల్ల ఏనుగులలో ప్రవేశించి వుంటాయని వారి విశ్వాసం. సయాం జాతీయ పతాకం మీద రెపరెపలాడుతూ వుండేది తెల్లఏనుగ చిహ్నం. దేశంలో ఎక్కడచూచినా రాయి, కర్ర, లోహం మొదలైనవాటి చెక్కడపు పనిలో ప్రత్యక్షమయేది తెల్లఏనుగు.

సయాందేశపు అనుదైనిక జీవితంలో ఈ తెల్లఏనుగు ప్రముఖస్థానం ఆక్రమించడానికి కారణం యేమిటంటే: గౌతమ బుద్ధుడు తన పూర్వపు అవతారంలో ఒక తెల్లఏనుగయి పుట్టాడట. గౌతముడు బుద్ధావతారం తాల్చడానికి ముందు చాలా అవతారాలు తాల్చాడు. అన్ని అవతారాలకు పరిణామ ఫలితమే బుద్ధావతారం. తనను గర్భందాల్చేముందు అతడి తల్లి అయిన మాయాదేవి స్వర్గంలో తెల్లటి ఏనుగును దర్శించిందట.

తెల్లఏనుగు అంటే అది అచ్చు మల్లెపువ్వు తెలుపులో వుండదు. చలవ చెయ్యని ఖద్దరుపంచ తెలుపుగా వుంటుంది. అంటే మామూలు ఏనుగులకంటె ఒక్కరవ్వ తెలుపుగా వుంటుంది. తలమీదా, తోకమీదా, అక్కడక్కడ కొన్ని తెల్ల వెంట్రుకలుకూడా ఉండవచ్చు.

ఇరవయ్యో శతాబ్ది ప్రారంభించేవరకూకూడా సయాం రాజు తెల్లఏనుగులు వుంటేనేకాని తృప్తిపడేవాడుకాడు. అధమం ఒక్కటైనా ఆస్థానంలో ఉండాలి. లేనినాడు తన్ను

తాను రాజుగా ఎంచుకొనేవాడేకాడు. ఖర్మం కాలి, అతడికి తెల్లఏనుగు లేకపోవటమే తటస్థించినట్లయితే, అతడు దానిని సంపాదించుకొనేందుకు యుద్ధాలుకూడా చేసేవాడు.

పట్టపుటేనుగును గురించి ప్రత్యేకించి కొన్ని విశేషాలున్నాయి :

రాజనగరుకు సమీపంలో—అద్భుతమైన, అపూర్వమైన దేవాలయందగ్గర పట్టపుటేనుగు ఉనికి. అది ఒక రమ్యమైన తాటితోపు. అందులో వుంటుంది ఈ తెల్లటి పట్టపు టేనుగ. పీతాంబరధారులయిన పదిమంది పురోహితులు (మతాచార్యులు) అమేషా దాన్ని కనిపెట్టుకుని వుంటారు. దర్జాగా తొండం వూపుకొంటూ, ఎదుట మేటగా వున్న గొడ్డను అటుయిటు విదిలించుకొంటూ బ్రహ్మాండమైన ఆ తెల్ల ఏనుగ ఒక చక్కటి తివాసీపైన నించుని వుంటుంది.

తివాసి అరచేతి దళసరిని మేలిమిబంగారుతో మలామా చేయబడి వుంటుంది. చూడటానికి ఎంతో వేడుకగా కనపడే ఆ అపరూపమైన, అమూల్యమైన తివాసీని పట్టపుటేనుగు తన పెద్దపెద్ద అడుగులతో తొక్కి వేస్తుంది.

కనిపెట్టుకునివుండే మతాచార్యుల బాధ్యత చాలా గురుతరమై వుంటుంది. పట్టపుటేనుగకు ఎట్టి లోటూ రాకుండా చూడాలి వారు. నాగా లేకుండా ఎప్పటికప్పుడు పచ్చిగొడ్డ వేస్తూండాలి. తివాసీకి మలమా చేసిన బంగారు రేగిపోతే, కనిపెట్టి వాటిని సరిచేసి కొత్తముక్కలు వేసేటందుకు బంగారు పనివాళ్ళు ఎల్లప్పుడూ వేయికన్నులతో చూస్తూవుంటారు.

తెల్లఏనుగును ఉంచుకొనే హక్కు ఒక్క రాజుకే వుంది. పౌరుడెవడూ అట్టిదాన్ని వుంచుకోకూడదు. ఎవడికైనా అలాంటిది లభిస్తే దాన్ని రాజుకే సమర్పించేసివేయాలి. అలా చేయకుంటే రాజే దాన్ని బలవంతంగా తీసుకొనిపోతాడు.

ఒకప్పుడు ఈ తెల్లఏనుగుల సంబరం విశేషంగా ఉండేది. ఏ అడవిలోనైనా, ఎక్కడయినా ఒక తెల్లఏనుగు కనిపించిందంటే ఆ వార్త చిటికలో దేశమంతా వ్యాపించిపోయేది. ప్రజల ఆనందానికి మేర వుండేదికాదు. రాజాజ్ఞ ప్రకారం కొంత మంది రాజకుమారులూ, యోధులూ ఒక్కొక్కసారి మంత్రులూ ఆ ఏనుగు కాపలాకు వెళ్లేవారు. ఏనుగులను పట్టి పెంపుచేసేవాడు వచ్చి దానికి ప్రజలలో, రాజవీధులలో ఎలా మెలగాలో —మంచి బుద్ధులూ, మర్యాదలూ నేర్పేవాడు. దేశం నలుమూలలనుంచీ జనులు ఆ ఏనుగుని చూడటానికి తీర్థ ప్రజగా వచ్చేవారు. దానికి మంచిమంచి బహుమానాలు తెచ్చి ఇచ్చేవారు.

ఇక—కొత్త ఏనుగును రాజసౌధానికి తీసుకొనివచ్చే వుత్సవం మంచి హుందాగా వుండేది. దానికోసం ఒక నూతన భవనాన్ని నిర్మించేవారు. ఆ భవనం నిర్మించి, ఏనుగును మచ్చిక చేసుకోవటం పూర్తి అయిన వెంటనే ఆ కరిరాజును రాజసౌధానికి తీసుకురావడానికి రాజే మహోత్సవంతో తరలి వెళ్లేవాడు. మొట్టమొదటి ఏనుగును చూసినప్పుడు రాజు దానిముందు

సాష్టాంగపడి, లేచి, విలువయిన బహుమతులు దానికి సమర్పించి, వెనుదిరిగి స్వయంగా మహోత్సవాన్ని నడిపించుకు వచ్చేవాడు.

ఊరేగింపు సాంతమై, తనకోసం ప్రత్యేకంగా నిర్మించబడిన నూతన భవనాన్ని చేరుకున్న తర్వాత ఆ శ్వేతకరికి పురోహితులు వేదోక్తంగా స్వాగత మిచ్చేవారు. అభినందనగీతాల్ని చదివేవారు. రాచఏనుగుగా శుద్ధి మొదలైన పూజలన్నీ చేసేవారు; దానికి యథావిధిగా నామకరణం చేసి ఎన్నో బిరుదులు ఇచ్చి గౌరవించేవారు.

ఆనాడు దేశమంతటా పండగ చేసుకొనేవారు. రాజ వంశంలోని వారూ, శ్రీమంతులూ సంగీత కచ్చేరీలు జరిపించి ఆనందించేవారు. సామాన్య ప్రజలు తమతమ గృహాల్ని రమ్యంగా అలంకరించుకొని, పతాకలు ఎగరవేసుకుని ప్రమోదంగా కాలం గడిపేవారు. పట్నమంతటా ఆ రాత్రి దీపావళి జరిగి దేదీప్యమానంగా ప్రకాశించేది.

తెల్ల ఏనుగును పట్టగలిగినవాడు చాలా అదృష్టవంతుడన్నమాట. అలా పట్టి తీసుకరాగలిగినవాడికి ఆస్థానంలో గొప్ప పదవి—అనగా ఆ ఏనుగుకు నీళ్ళు మోసే వుద్యోగము...ఇచ్చేవారు. ఇది సామాన్యమైనదనుకొంటారేమో? పవిత్రమైన తెల్ల ఏనుగు నీళ్ళుత్రాగే పాత్రలన్నీ బంగారువే సుమండి!!! ...దీన్నిబట్టి ఈ ఉద్యోగం ఎంతటి ఘనమైనదో ఇట్టె ఊహించవచ్చు. ఈ ఉద్యోగికి వంశపారంపర్యా వార్షిక పింఛనుకూడా ఇచ్చేవారు.

ఇక ఏనుగు మాట: దాని భోగం వర్ణించతరంగానిది. చీనిచీనాంబరాలు, కనక రత్నాభరణాలు, లెక్కలేకుండా వుండేవి దానికి. కొంతమంది పురోహితులూ, సౌకర్లూ, గాయకులూ, నృత్యగీతాదులతో దాన్ని సంతోషపెట్టడానికని ప్రత్యేకింపబడి దేవదాసీ కన్యలు...సర్వదా దాని సేవలోనే నిమగ్నులై వుండేవారు. దాని శిరస్సుమీద ఒక బంగారు పతకం, ఆ పతకంమీద దానిపేరూ, బిరుదులూ చెక్కబడి వుండేవి.

ఆ ఏనుగు నిద్రపోవడానికి ఇష్టం చూపితే దానికి జోల పాటలు పాడి నిద్ర బుచ్చాలి. అది ఉత్సాహంగా కనబడితే భోగంకన్నెలు ఆటపాటలచేత గజరాజును ఆనందింపజేయాలి. అది ఆకలిగొంటే, ఆ దేశంలో పండే మధురాతి మధురాలైన ఫలాలు దానికి ఆరగింపు చేయాలి; నవనవలాడే కాయగూరలు నోటి కందించాలి. ఇలా అనుక్షణమూ దానికి రాజభోగం జరిగే దన్నమాట.

సంవత్సరాని కొకసారి రాజప్రాసాదంలోని తెల్లఏనుగ లన్నిటినీ పవిత్రమైన మంత్రజలంతో అభిషేకం చేస్తారు. ప్రార్థనాదికాలు జరుపుతారు. వాటికి సంగీతం వినిపిస్తారు. ఇదంతా ఏదైనా కీడు వుంటే దాన్ని పోగొట్టడానికి జరిగే తంతు.

ఏదైనా ఒక తెల్లఏనుగు చనిపోతే దాని అంత్యక్రియలు కూడా అట్టహాసంగానే జరుగుతాయి. కొందరు పురోహితులూ వైద్యులూ, ఒక పెల్లకోతీ—అంతా కలిసి ఆ ఏనుగు కళేబరం

దగ్గిరికి వెళతారు. దాని ప్రక్కగా ఒక గొయ్యి త్రవ్వి దాని నిండా సాంబ్రాణి మొదలైన సుగంధద్రవ్యాలు నింపి ధూపం వేస్తారు.

ఆ తర్వాత శవాన్ని పట్నం వెలుపలికి మోసుకుపోయి ఒక బహిరంగస్థలంలో విడిచిపెట్టేస్తారు. ఆ చనిపోయిన ఏనుగు ఆత్మ తిరిగివచ్చి ఏవిధమైన నష్టాన్నీ కలిగించకుండా అది చని పోయిన మూడు రోజులవరకూ పురోహితులు ఆ గజశాలలో నిత్యమూ ప్రార్థనలు జరుపుతారు.

అటుపిమ్మట ఆ ఏనుగు కళేబరంలోని మాంసమంతా హరించిపోయిన తర్వాత—దాని దంతాలూ, ఎమ్ములూ తీసి జాగ్రత్తపెడతారు.

ఏనుగులను బహుమతిచేయటం ఆ కాలమందు చాలా గొప్పగా వుండేది. ఐతే—నిజానికి, ప్రభువు ఎవరికైనా ఒక ఏనుగును బహుమతి చేశాడంటే అది వాడికి మేలుకోసం కాదు, వాడి అంతానికే. కనుక, ఇది పైకి బహుమతిగా కనబడినప్పటికీ బహుమతి కాదు, శిక్షే. ఏమీ!—ఏనుగును స్వీకరించి భరిం చటం ఎవళ్ల తరమవుతుంది ? ఏనుగును—అందులోనూ తెల్ల ఏనుగును భరించేవా డెంతటివాడై ఉండాలి! కాబట్టి, ప్రభువు ఎవరినైనా శిక్షించాలెనంటే, పైకి బహుమతిగా అగుపించే టట్లు, ఒక ఏనుగును ఇచ్చేవాడు. ప్రభువిచ్చే బహుమతిని నిరాక రించట మెలాగ ? పోనీ అంటే, ఏనుగును తలపై పెట్టుకుని భరించట మెలాగ ?—ఈ విధంగా ఏనుగును బహుమానంగా పొందినవాళ్ళు నామరూపాలు లేకుండా నాశనమైపోయేవారు.

ఎవరినైనా మట్టుం చేయాలని సయాంరాజుకు తలంపు కలిగితే తెల్లఏనుగును బహుమతి చేసేవాడట! దీనినిబట్టే దుబారాగా భరింపరాని ఖర్చు చేసేవాడిని ఇంగ్లీషులో 'White Elephant' అంటారు.

అయితే—

రాజులకూ, రాజ్యాలకూలాగనే తెల్లఏనుగకుకూడా దశ మళ్లింది. పాశ్చాత్య నాగరికతా, పాశ్చాత్యభావాలూ సయాంలోకి దిగుమతి కాగానే తెల్లఏనుగు భోగం తిరుగుమొగం పెట్టింది. ఇప్పుడు పూర్వం జరిగే గౌరవ మర్యాదలూ, అట్టహాసాలూ, ఉత్సవాలూ, ఊరేగింపులూ ఏమీ లేవు. పురోహితులూ లేరు. భోగంకన్నెలూ లేరు. ప్రత్యేక భవనమూ లేదు.

ఈనాడు ఏ పర్వత సానువులలోనో తెల్లఏనుగు కనిపిస్తే పట్టుకోవటం, రైలుపెట్టెలో పెట్టడం, పట్టణానికి రవాణా చేయడం, మామూలు ఏనుగుల శాలలలోనే దాన్ని కట్టడం, గడ్డి కసవూ మేపడం జరుగుతున్నది.

మన శతకవాఙ్మయంనుండి ఏనుగును గురించిన కొన్ని ముచ్చటనకలు :

'తక్కువ తరగతి గల నరుఁ
డెక్కువ యగువానిఁ గాంచి యేడ్చుచునుండున్
టెక్కుగఁ గరి వీథిం జన
గుక్కలు గని మొఱుగకున్నె గువ్వలచెన్నా!'

'పంది పిల్లలీను పదియు నైదింటిని
కుంజరంబు నీను కొదమ నొకటి

యుత్తమ పూరుషుఁ డొక్కఁడు చాలఁడా
విశ్వదాభిరామ వినుర వేమ'

'సుతులచేత పుణ్యసుఖముఁ బొందుదమని
మనుజుఁ డుండు కర్మమతము దగిలి
యేనుఁగు పడియున్న నెత్తునా మశకంబు ?
విశ్వదాభిరామ వినురవేమ'

మరొక్క చమత్కార పద్యం: ఏనుగంతటి బ్రహ్మాండమైన జంతువును ధిఃకరించే దోమ డంబాలు చూడండి—

'పరగగ నాల్గుపాదములు బాగగు తుండము సంస్కృతంబు మా
కిరువురకున్ సమంబె మఱి యెక్కువ యొక్కటి పక్షయుగ్మ ఖే
చరుడను నాకు సామ్య మెకసామజమా ? యని దోమ పల్కన
ట్లరయ మహానుభావులను నల్పుడు సోరికొలందు లాడెడిన్'

రామరాయ భూపాలుని ఆస్థానంలో గొప్ప కవి పండిత సన్మానం జరిగింది. ఆ ప్రభువువల్ల పొందిన అపార గౌరవాన్ని వినుతిస్తూ తిరుపతి వేంకటేశ్వరకవులు ఇలా వాకొన్నారు :

'ఏనుగు నెక్కినాము,
ధరణీంద్రులు మ్రొక్కగ నిక్కినాము'

ఈవిధంగా కవీశ్వరులనూ, పండితులనూ ఏనుగెక్కించి సంతోషపెట్టిన సందర్భాలలోనే కావ్యాలూ విద్యలూ ప్రకాశించాయి.

గజమును గురించిన ప్రస్తావనలో గజపతుల గురించి ఉదహరించే తీరాలి. విజయనగర సామ్రాజ్యాన్ని ఏలినవారు గజపతులు. ఒరిస్సాలోని గంగవంశంవారూ గజపతులే. వారిలో ముఖ్యుడు ప్రతాపరుద్రుడు. ఈయన హయాంలో ఏనుగు చిహ్నం గల నాణెములను వాడుకలో పెట్టారు.

'గజపతినగరం' అనే ఊరు విశాఖమండలంలోనిదే. 'గజపతి' అనే ఒక నదికూడా వున్నది, ఆ ప్రాంతంలోనే.

పురాణకాలమందూ, ఈనాడు కూడా ప్రసిద్ధిచెందిన ఆయా ఏనుగుల నామాలను ఇక్కడ పేర్కొనటం అప్రస్తుతం కానేరదని నా వుద్దేశం :

'సుప్రతీకము' : కుబేరుని ఏనుగు ; భగదత్తుడనే రాజు ఏనుగు.
'అశ్వత్థామ' : మహాభారత యుద్ధంలో పాల్గొన్న ఏనుగు.
'ఐరావతము' : ఇంద్రుని ఏనుగు - ఐరావతం పేరటనే బర్మాలో 'ఐరావతి' అనే నది ఉన్నది.
'కువలయాపీడనము' : కంసుని ఏనుగు.
'డంబో' : లండన్ జంతుప్రదర్శనశాలలోని ప్రసిద్ధ గజము.
'ఇందిర' : నెహ్రూ జపానుపిల్లలకు కానుక పంపిన ఏనుగు.
'శాంతి' 'అశోక' : అనేవి రెండూ జవహర్ పండితుడు అమెరికాకు బహుమతిచేసిన ఏనుగుల పేర్లు.

ఏనుగును గురించి ప్రస్తావించినప్పుడు ఈనాడు ఎవరికైనా ఫిలింస్టార్ 'సాబూ' చిత్రగాథ వెంటనే స్ఫురిస్తుంది : సాబూ మైసూరులోని ఒక మావటీని కొడుకు. సాబూకి 'ఏనుగబ్బాయి' (ఎలిఫెంట్ బాయ్) అని సార్థకమైన బిరుదు కలదు.

సాబూకి చిన్నప్పుడే తలిదండ్రులు పోయారు. వీధుల వెంట తిరుగులాడుతున్న సాబూను ఒక బ్రిటిష్ ఫిలిం కంపెనీ డైరెక్టరు చూచి, ఆతనిలోని గొప్ప లక్షణాలను పసికట్టి, చేరదీశాడు. చేరదీయడమేమిటి ?——తనవెంట ఇంగ్లండు తీసుక

పోయాడు. అక్కడ సాబూ ఇంగ్లీషు నేర్చుకున్నాడు. అక్కడ చాలా చిత్రాలలో నటించాడు. రెండవ ప్రపంచ మహా సంగ్రామంలో పాల్గొని, ఫిలింస్టార్లలో ఎవ్వరూ పొందలేనన్ని గౌరవాలను పొందాడు.

తరువాత హాలీవుడ్ తిరుగావచ్చి దాదాపు పదిహేను ఫిలిములలో నటించాడు. సాబూ నటించిన చిత్రాలు విశేష ఖ్యాతిని ఆర్జించి, కనకవర్షం కురిపించాయి.

సాబూ చాలా ముక్తసరిగా వుంటాడు. కాని, ఏనుగులంటే మక్కువ. ఆ ప్రసక్తి వస్తేమటుకు తనను తానే మరచిపోతాడు. జంతుజాలంలోకల్లా ఏనుగు చాలా తెలివైనదనీ, ఎవరు తనకు ఉపకారం చేయదలచుకున్నారో ఎవరు అపకారం చేయదలచుకొన్నారో అది ఇట్టే పసికట్టివెయ్యగలదనీ అంటాడు. ఏనుగు అంత బ్రహ్మాండమైన జంతువైనప్పటికీ, అద్భుతమైనటువంటి అచ్చెరువు కొలిపేటటువంటి గరిడీ లెన్నో ప్రదర్శించగలదని వినుతిస్తాడు.

---



# సాహిత్యంలో 'కుక్క'

ఎందుచేతనోగాని సుమతిశతకకర్తకు 'కుక్క' అంటే ఇష్టం లేకపోయింది. అందుకనే దానిపట్ల లాఘవాన్ని కనబరుస్తూ—

'కనకపు సింహాసనమున
శునకము గూర్చుండబెట్టి శుభలగ్నమునన్
దొనరగ బట్టము కట్టిన
వెనుకటి గుణమేల మాను వినురా సుమతీ'

అని చెప్పాడు. ఇలా చెప్పినంతమాత్రాన కుక్కకు వచ్చిన లోపమేమీ లేదు.

కుక్క గొప్పతనాన్ని వెల్లడించటానికి పురాణకాలమందూ, ఈ కాలమందూ కూడా తార్కాణాలున్నాయి. తనకు ప్రియమైన కుక్కను వెంట రానిస్తేతప్ప స్వర్గానికి రానేరానని నిరాకరించాడు యుధిష్ఠిరుడు.

పోతే—ఈనాడు బొచ్చుకుక్కల్ని ఒళ్లో కూరోబెట్టుకుని దొరసానులు కారులలో షికారు తీసుకపోవటం నిత్యమూ చూస్తూనే వున్నాము. ఇంతకూ, కుక్కయితేనేమి, మనిషయితేనేమి? ఎవరూ జాతకాలనుబట్టి నడుస్తూవుంటుంది మనుగడ.

'వెనుకటి గుణమేల మాను?' అంటూ సుమతిశతకకర్త ఉటంకించాడు. ఇది చాలా కించపరచే మాట. అందరికూ తెలిసేటట్టుగా చెప్పాలంటే, బహుశా 'కుక్కబుద్ధిని' గురించి వర్ణించాలని ఈ గ్రంథకర్త వుద్దేశమై వుంటుందనుకుంటాం. మనకు తెలిసినంతలో 'కుక్కబుద్ధి' అంటే ఆత్మగౌరవం లేని పని చేయటం. దాలిగుంటలో పడుకొని ఉన్నంతసేపూ బుద్ధిగా వుందామనే అనుకొంటుంది పాపం, కుక్క. కాని మళ్లీ అంతలోనే లేచి, బూడిద దులిపేసుకుని, ఏ యింట్లో దూరుదామా అని ఆలోచిస్తూ వుంటుంది. దీని మాటకేం!

దొరసాను లంలగా కుక్కను చేరదీస్తారుకాని, మన వాళ్ళు కేవలమూ నిరసించారు. 'కుక్కను ముద్దెట్టుకుంటే మూతెల్లా తెగనాకుతుం'దంటారు అనుభవజ్ఞులు. అనగా అల్పబుద్ధివాళ్ళకు అధికారమివ్వకూడదనే మాటకూడా ఇందులో ధ్వనిస్తుంది. ఈ మాటా కాదనలేము. ఈ నిరసన ఇంతటితో తీరలేదు.

'కుక్కను పెంచితే గండాయె
కూటి కుండలకెల్లా చేటాయె'

అని పెద్దల వాక్యం.

ఏది ఎల్లా వున్నా - విశ్వాసానికి కుక్క పెట్టింది పేరు. విశ్వాసం గల మనిషిని 'కుక్కలాగా పడివున్నా' డంటారు. ఒకప్పుడు అక్బరుషాదుషా వీరబల్‌ని ఒక ప్రశ్న వేశాడు: 'లోకంలో విశ్వాసం గలదేది? లేనిది ఏది?' అని. అందుకు వీరబల్ మారునాడు ఒక యువకునీ (తన అల్లుణ్ణి) ఒక కుక్కనూ తీసుకవచ్చి ఎదుటపెట్టి, 'ప్రభూ! విశ్వాసం కల జంతువు కుక్క, ఇదుగో. విశ్వాసం లేని జంతువు అల్లుడు, ఇదుగో' అన్నాడట!

కుక్క విశ్వాసాన్ని వెల్లడిస్తూ మన వేంకట పార్వతీశ్వర కవులు:

'అన్నమును బాలు నిడి పెంచుచున్న నన్ను
ఎన్నడును వీడబోదు నా చిన్ని కుక్క
తోక యాడించుకొనుచు నాతోడ వచ్చి
నడచునప్పుడు నాముందు నడచుచుండు'

ఆశ్రయించిన చోటును అంటిపెట్టుకునివుండటమే కుక్క గుణం. అందుకనే 'గానుగ మరగిన కుక్క' అని సామెత.

'కుక్క'కి గల నామాంతరాలలో కొన్ని: శునకము, శ్వానము, కుర్కురము, వేసి, గ్రామసింహము, సారమేయము, జాగిలము (వేటకుక్క).

కుక్కలలో రకాలు లెక్కకు మిక్కిలిగా వున్నాయి. అందులో కొన్ని యివి: ఊరకుక్క, మందకుక్క, మాస్టిఫ్- ఇవి కావలి కాసే కుక్కలు.

సెంట్ బెర్నార్డ్, న్యూఫౌండ్‌లాండ్ కుక్కలు - అపాయంలో ఉన్నవారిని రక్షించటంలో పేరుపొందినవి. వేటకుక్క

లలో చెప్పుకోదగినవి-బ్లడ్‌హౌండ్; ఫాక్స్‌హౌండ్ (పాలెగాని కుక్క); గ్రేహౌండ్ (శోణంగి కుక్క); నల్ల పసివేపి.

ఇవికాక—బుల్‌డాగ్ (ఎద్దు మొద్దు కుక్క); స్పానియల్, టెర్రియర్, రేచు (అడవి) కుక్క, డింగో—ఇలా మరి ఎన్నో రకాలున్నాయి.

ఎలిజబెత్తు రాణి కాలంలో హాకిన్స్, డ్రేక్ అని ఇద్దరు ఓడదొంగలు (PIRATES) ఉండేవారు. వారికి 'నీటి కుక్కలు' (Sea-dogs) అనే సార్థకనామం వుండేది.

'కుక్కదానం పట్టి ఐనా కుటుంబం పోషించుకోవా'లని అంటారు. అంటే ఏవిధంగానైనా సరే, ఎన్ని ఒడుసుట్లు పడి ఐనా సరే కుటుంబపోషణ చేసుకోవటం ముఖ్యమని.

ఎవడన్నా నమ్మటానికి వీల్లేనివాణ్ని 'అబ్బాయీ! నీతోటి పని లాభంలేదు. కుక్కతోక పట్టుకు గోదావరి యీదినట్టే' అనేస్తారు.

అన్నట్టు—కుక్కతోక అన్ని జంతువుల తోకవంటిదీ కాదు. వెదురుబద్దలు వేసి కట్టినా దాని వంక తీరదు. కాబట్టి సాధ్యంకాని విషయంలో 'కుక్కతోక' పోలిక చెబుతారు.

'ఏనుగు వెళుతూవుంటే కుక్కలు మొరిగినట్టు' అని ఒక సామెత వుంది. అక్కడికి మహా ఏనుగు గొప్పా, కుక్కలు తక్కువా అన్నమాట! గొప్ప కొద్దీ తారతమ్యం ఇక్కడ వెల్లడి అవుతున్నది. ఏనుగువంటి గొప్పవాళ్లు వెళుతూవుంటే కుక్కలవంటి అల్పులు మొరుగుతూ వుంటారని భావం.

ఈ సందర్భంలోనే ఒక పూర్వకవి చాటువు :

'పొనగ నీజాతి గుంపుతోఁ బుల్లెల కడ
జగడమాడు రణప్రియ ! సారమేయ !
రాజగృహమున గల గజరాజుతోడ
కడక మొఱుగకు మది వృథా కంఠశోష'

కుక్కకూ ఏనుగుకూ గల భేదాన్ని నిరూపిస్తూ భర్తృహరి చక్కగా చెప్పాడు ఇలా :

'వాలము ద్రిప్పు నేలబడి వక్త్రము గుక్షియు జూపు గ్రిందటం
గాలిడు ద్రవ్వు బిండదుని కట్టెదుటన్ శునకంబు భద్రశుం
డాలము శాలితండుల గుడంబుల చాటు వచశ్శతంబుచే
నోలి భుజించు ధైర్యగుణయుక్తిగ జూచు మహోన్నతస్థితిన్'

—'తనకు పిడికెడు అన్నము వేసేవాని యెదుట తోక ఆడించుట, వెల్లకిలపడి నోరు కడుపు చూపించుట మొదలైన నీచకృత్యాలు లెన్నో చేస్తుంది—కుక్క. ధైర్యయుతమైన గజశ్రేష్ఠమో ? ప్రియవాక్యములతో లాలించి మావటీడు అందించే ఆహారాన్ని గ్రహిస్తూ వుంటుంది'—అని దీని భావం.

'కుర్కుర నీచత్వము' అనే పేరుతో తిక్కన సోమయాజి భారతంలో కుక్కయొక్క నీచగుణాన్ని తెలిపే ఒక కథను వివరించాడు.

ఈనాడుకూడా అమలులో వున్నది 'కుక్కకాటుకు చెప్పుదెబ్బ' అనే సామెత. కుక్క కరిస్తే చెప్పుచ్చుకు కొడతారు. ఈ ప్రక్రియను చూస్తూ కాదనటం ఎలా ?

చేయవలసిన పని ఆలస్యంగానూ, అకాలంలోనూ చేసినప్పుడు 'దొంగలు పడ్డ ఆరునెలలకు కుక్క మొరిగినట్టు' అనే జాతీయం ఉపయోగిస్తాము.

ఒకానొక దొరవారు కుక్కకు భాషనేర్పి వేటకు తీసుక వెళ్లారట. అప్పుడా 'మాటలు నేర్పిన కుక్కను వేటకు తీసికెళ్తే, ఇస్కో అంటే ఉస్కో అందిట.'

కుక్కలు శుభం కోరుతాయని ఒక నమ్మిక. 'ఊళ్లో పెళ్ళయితే కుక్కలకే హడావుడి హెచ్చు.'

ఐతే కుక్కలకు జ్ఞాతివైరం ఒకటి పడిచింది. తీరా పెళ్ళి అయిన తరువాత పుల్లాకులు పడవేస్తే, కుక్కలు కాట్లాడుకు చస్తాయి.

'మొరిగే కుక్కలు కరవవు' అని ఒకమాట వున్నది.

ఐతే - కుక్కలు గుంపుగా చేరి మొరుగుతూవుంటాయి ఒకప్పుడు. అది గ్రామానికి అరిష్టమని అంటారు.

గ్రామం అనేటప్పటికి ఇంకో విషయం స్ఫురిస్తుంది. అడవిని సింహం ఎలా కాపాడుతుందో, గ్రామాన్ని శునకం అలా కాపాడుతుంది. అందుకనే కుక్కకు 'గ్రామసింహం' అనే బిరుదు. ఈ బిరుదును వ్యంగ్యంగా వాడటంకూడా కద్దు— 'తోక ఒక్కటి తక్కువగాని గ్రామసింహ మంతటి వాడవోయ్' అని.

ఒక ధైర్యశాలినిగురించి వర్ణిస్తూ—

'కుక్క మొరిగితే బట్ట తడుపుకొనే ప్రతాప నరసింహరాజు'

—అని శ్రీ కూచి నరసింహం పంతులుగారు చమత్కరించారు వారి 'కొత్త తెనుగు తమాషా'లో.

'కుక్క'ను గురించి ప్రసిద్ధమైన ఒక పిల్లల గేయం :

'అల్లవారింటికీ
చల్లకెడితేను
అల్లవారి కుక్క
'బౌయ్' మన్నాది
నాకాళ్ల గజ్జెల్లు
ఘల్లుమన్నాయి
నా చంకలో బిడ్డ
కయ్యిమన్నాడు'

చిన్నబిడ్డలు చప్పుడుచేస్తూ నీళ్ళుతాగితే 'ఏమిట్రా! కుక్క కలికినట్లు అలా తాగుతావు' అంటారు. భోజనంచేసిన విస్తరి పరిశుభ్రంగా వుంటే 'వాడి విస్తరి చూడు, కుక్క నాకి నట్లు నాకేశాడు' అని అభినందిస్తారు.

చేపట్టిన పనల్లా పాడుగొట్టేవాణ్ణి చూచి, 'కుక్కకు వచ్చేవన్నీ గొర్రెపళ్ళ లెట్టూ' అని ఆక్షేపిస్తారు.

నిష్ప్రష్టుడిని చూచి: 'నీ పాట్లు కుక్కలుకూడా ఒల్లవు' అంటారు.

పనికిరానివస్తువును 'కుక్క ముట్టుకుపోయిం'దని చెప్పటం పరిపాటి.

ఒక లక్ష్యమూ ప్రద్దేశమూ లేకుండా తిరిగేవాడిని 'పిచ్చి కుక్క'లా తిరుగుతున్నా వంటారు.

మన దేశంలో మద్రాసువంటి బస్తీలలో అడపా తడపా వీధికుక్క లన్నింటినీ పట్టి, చంపటం ప్రభుత్వాచారమై వుంది. అలా కుక్కలనుపట్టి మోసుకపోయే బండిని 'Dog Van' అంటారు.

ఒకపని తలపెట్టినప్పుడు దాని మంచిచెడ్డలు రెండూ

భరించాలి. అందుకనే 'కుక్క వేషం వేస్తిమంటే మొరిగే తీరాలి;' లేకుంటే వల్లకాదు.

కొంతమంది పెద్దమనుష్యులు మహాచెడ్డ అడావిడిగా తెంటబడుతూ వుంటారు. వాళ్ళని గురించి "ఎందుకయ్యా 'చిత్తకార్తెకుక్క'ల్లాగ తిరుగులాడుతారు?" అని ప్రశ్నిస్తారు.

ఇంట్లో ఏదేనా తెలియకుండా ఎత్తుకుపోయేదాన్ని 'దొంగకుక్క' అంటారు. దాన్ని కొట్టడానికి కూడా ప్రయత్నిస్తారు. అయితే, సాధారణంగా 'కుక్క వస్తే కఱ్ఱ దొరకదు, కఱ్ఱ దొరికితే కుక్క రాదు'.

ఒకరింట్లో పాయసం వండుకొని సిద్ధంగా పెట్టుకొన్నారట. ఒక 'దొంగకుక్క' వచ్చి దానిమీాది తెట్టు కరుచుకుపోయేటంతలో ఇంటావిడ వచ్చి బెదరించింది. భోజనాలవేళ నలుగురూ పాయసం చాలా బాగుందని పొగిడారట. ఆ పొగడ్తల కామె పొంగిపోయి, "మీాది అట్టు 'చే' పెత్తుకపోయింది గాని లేకుంటే ఇంకా రుచిగా ఉండును" అనేసిందట.

కుక్కను గురించి ప్రతికూలంగా చెప్పే సామెతల్లో ఇంకొకటి ఉంది. 'చెట్టు చెడే కాలానికి కుక్కమూతి పిందెలు' అనేది.

కుక్క చాలా మహత్తరమైనది గనుకనే పుణ్యక్షేత్రమైనటువంటి కాశీలో 'కాలభైరవస్వామి'కి వాహనంగా వెలసి పూజ లందుకుంటున్నది.

దైవతుల్యమైన అటువంటి 'కుక్కను ఎవళ్ళయినా చంపినట్లయితే గుడి కట్టినా ఆ పాపం పోదు' అని పెద్దలుచెప్పారు.

అలాంటి సందర్భంలో విశ్వామిత్రుడువంటి బ్రహ్మర్షి కుక్క మాంసం తిన్నాడని పురాణాలు చెబుతూవుంటే అది విడ్డూర మైన విషయం కదా!

పార్శీలలో ఒక వింత ఆచారం వుంది. ఎవరైనా ప్రాణం వదిలే ముందు (ఆత్మ పరబ్రహ్మంలో ఐక్యమయ్యే ముందు) వారికి కుక్కను తీసుకువచ్చి చూపిస్తారు.

ఇంగ్లీషులో కుంభవృష్టిగా వర్షం కురవటాన్ని 'It is raining cats and dogs' అంటారు.

తాను అనుభవించలేక మరి ఒకర్ని అనుభవించనియ్య కుండా ఉండేవాణ్ని 'Dog in the Manger' అంటారు. ఈ లోకోక్తి సుప్రసిద్ధమైన ఈసపు కథకు సంబంధించినది.

'ఏరు ఎంత పారినా కుక్కకి కతుకు నీళ్లే' అని సామెత. దీనినే భాస్కర శతకకర్త లోభికి పోలుస్తూ ఎలా చెప్పాడో:

'అతి గుణహీనలోభికి బదార్థము గల్గిన లేకయుండినన్
మితముగ గాని కల్మిగల మీదటనైన భుజింప డింపుగా
సతమని నమ్మి దేహమును సంపద నేఱులు నిండి పాఱినన్
గతుకగజూచు గుక్క తన కట్టడ మీఱక యెందు భాస్కరా.'

తెలుగులో 'కుక్కగొడుగు', 'కుక్కపొగాకు' అనే పదాలున్నాయి. వీటికీ కుక్కకీ సంబంధం ఏమిటో పరిశోధ కులే యోచించాలి.

'సుగ్రీవుని ఎడమకాలు శునకము గొరికెన్' అని ఒక చిత్రమైన సమస్య. దీనిని కవి ఇలా వేడుకగా పూర్తిచేశాడు:

'ఆగ్రారపు నడివీధిని
నిగ్రహమున బొమ్మలాట నేర్పున నాడన్

విగ్రహము తెత్త మఱచిన
సుగ్రీవుని ఎడమకాలు సునకము గొఱికెన్'

'కుక్క'ను గురించిన మరికొన్ని సామెతలు :—

'కుక్క సంతకెళ్లినట్టు'
'పెఱ్ఱకుక్కను వేటకు తీసికెళ్లినట్టు'
'కుక్కకేటికి కుచ్చులకుళ్లాయి'
'కక్కిన కుక్కవద్దకు కన్న కుక్కవద్దకి
కానివాణ్ని అయినా పంపవద్దు'
'తలుపు లేని యింట్లో కుక్క దూరినట్టు' (రక్షణ లేని ఆస్తి)
'తన తలుపు తీసి పొరుగింటికి పెట్టి
రాత్రి అంతా కుక్కలు తోలుతూ కూర్చున్నాడట'
'తిన్నకుక్క తినిపోతే, కన్నకుక్కను పట్టి కాళ్లు విరగకొట్టినట్టు'
(చేసింది ఒకరు; ఫలం అనుభవించేది మరొకరు)
'పిల్లి కండ్లు పొగొరుతుంది; కుక్క పిల్లలు కలగొరుతుంది'
(అప్పుడే రెండిటికి తిండి బాగా దొరుకుతుంది)
'ఆచారం ఆచారం అన్నంటోట్లూ అంటే,
'దెబ్బనేర్చు కుక్క దొంతులు పేర్చునా?'
పెద్ద చెరువు కుక్క ముట్టుకొన్నది అన్నాడట' (అతి చాదస్తుడు)
'ఎక్కడ కొట్టినా కుక్కకు కాలుకుంటు'
'ఒక్కపొద్దుమాట కుక్క యెరుగునా?'
'చవియెరిగిన కుక్క చావకొట్టినా పోదు'
'చిన్నక్క చిలక; పెద్దక్క గిలక;
చూస్తే చుక్క; రేగితే కుక్క'
'నీ ముష్టి లేకపోతే మానెగాని నీ కుక్కని కట్టెయ్'
'పొయ్యి అరిస్తే బంధువులు; కుక్కలు కూస్తే కరువు'
'చాకలోళ్ల కుక్కకి చల్లా-కూడూ;
బాపనోళ్ల కుక్కకి పప్పూ-కూడూ'
'వన్నెచీర కట్టుకొన్న సంబరమేగాని

వెర్రికుక్క కరిచినది ఎరుగదు'

'కుక్కని గుర్రంలా పెంచి పెడ్తే తానే మొరిగాడట'

ఈ సందర్భంలో కొన్ని సంస్కృత లోకోక్తులు :

భ్రాంతిచేత 'ఇది నాది' అనుకొని దానికి హాని కలిగి నప్పుడు దుఃఖించటాన్ని 'శ్యాలశునకన్యాయము'గా చెప్తారు. ఒకడు తనభార్యకు కోపం తెప్పించటానికి ఒక కుక్కను పెంచి దాన్ని 'బావా' అని సంబోధించి తిడుతూవుండే వాడట. ఆ కుక్క నిజంగా తన తమ్ముడే అనుకుని అతని భార్య దుఃఖిస్తూవుండేదిట.

లోభిని కుక్కకు పోలుస్తూ ఒక లోకోక్తి వుంది. అదే 'శ్వపిశునకన్యాయము'. లోభి కుక్కలాంటివాడు. ఇద్దరూ అస్థిరంగానే ఉంటారు. లోభిది వక్రబుద్ధి; కుక్కది వక్రమయిన వాలం. లోభిలాగానే కుక్కకీకూడా జ్ఞాతివిరోధం హెచ్చు.

అల్లుళ్ళపట్ల సామాన్యంగా 'శ్వశురగృహం పరమసుఖం, త్రిరాత్రాత్ శునకసమానః' అనే లోకోక్తి వాడుతారు. మామగారి యిల్లు స్వర్గతుల్యంగా ఉంటుందిగాని, మూడు రాత్రులు దాటితే అల్లుడు కుక్కతో సమానుడవుతాడని దీని అర్థం.

శతకవాఙ్మయంనుండి కుక్కకు సంబంధించిన కొన్ని పద్యాలు :

> 'మది పను నాసపత్తయెడ మంచిగుణోన్నతు డెట్టి హీనునిన్
> వదలడు మేలుపట్టున నవశ్యము మున్నుగ నాదరించుగా
> త్రిదశ విమానమధ్యమున దెచ్చి కృపామతి 'సారమేయమున్'
> మొదల నిడండె ధర్మజుడు మూఁగి సురావళిచూడ భాస్కరా'
>
> (భాస్కరశతకం)

'కుక్కతోక దెచ్చి గొట్టంబు జేర్చిన
గ్రోవి చెంతనుండు గొంత తడవు
యెంత జెప్ప జెడుగు పంతంబు మానునా
విశ్వదాభి రామ వినుర వేమ'

'చిక్కియున్నవేళ సింహంబునైనను
పక్క కుక్క చేరి బాధసేయు
బలిమి లేనివేళ బంతంబు చెల్లదు
విశ్వదాభి రామ వినుర వేమ' —(వేమన)

ఒక చాటువు—

'కుక్క కుక్క యనుచు నొక్క నరుని దిట్ట
వినిన కుక్క యిట్లు వెననపడెను ;
నమ్మువాని చెఱచు నరునికంటెను మేము
చెడితిమేమి ఎంత జడులమైన'

ప్రపంచం మొత్తంమీద సారస్వతంలో కుక్క విశ్వాసాన్ని వెల్లడించే గాథలు, సంఘటనలు లక్షలున్నాయి.

ఒకానొక సందర్భంలో వేటకుక్కల ప్రశస్తిని గురించి మన తిరుపతి వెంకటకవులు ఇలా చెప్పారు :

'ఊరకుక్కలు పదివేలు చేరనేల ?
చాలదే వేటకై ఒక్క జాగిలంబు ?'

——



# సాహిత్యంలో 'నక్క'

తక్కిన నాలుగుకాళ్ళ జంతువు లన్నిటిలాగా నక్కను ఉదా సీనంగా చూడటానికి వీలులేదు. మన కథాసారస్వతం తీసు కొంటే, నక్క లేనిదీ కథ నడవనే నడవదనే యాదార్థ్యం వెల్లడవుతుంది.

అసలు మన బాలబాలికలకు 'నక్క — ద్రాక్షపళ్ళు' కథతోనే విద్యాభ్యాసం జరుగుతుంది. 'నక్కజిత్తులు' అనే నానుడి ఎందుకు పుట్టిందో కాని, ఇది కేవలమూ నీలాపనింద అనే అనాలి. ఏమిా అంటే: మన కథలలో నక్కలు రాజ కుమారులకు పిల్లల్ని చూసిపెడతాయి. ప్రేమికుల్ని కలుపు తాయి. అమాయిక బ్రాహ్మల్ని దుష్టజంతువుల బారినుండి తప్పించి పుణ్యాం కట్టుకుంటాయి. ఇటువంటి కార్యాలను నెర వేర్చేందుకే నక్క తన జిత్తులను ప్రయోగిస్తుంది. ఈ విధంగా నక్కసాయం పొందినవాళ్ళు ఎంతోమంది ఉంటున్నారు.

ఉంటున్నారు, నిజమే. అయితే—మానవుడు దానిని

పూర్తిగా నమ్మినట్టూ, దానిమీదనే ఆధారపడినట్టూ మన సుకు తట్టినప్పుడే అది న్యాయం చేయటానికి పూనుకొంటుంది. ఈ మాట మనం మరచిపోకూడదు. నక్కను మనం నమ్ము కున్నట్టయితే అది ఎంతటి త్యాగాన్నయినా చేయడానికి సిద్ధ పడుతుంది.

మరొక్కమాట: అది త్యాగంచేసి మనకు సాయపడి నప్పట్లో మనం దానికి కృతజ్ఞత చూపించాలి. లేకుంటే అది మనకు తగిన శాస్తి చేసి, మనల్ని మనం తెలుసుకునేట్టు చేస్తుంది.

నక్క నామాంతరాలలో కొన్ని:-శివ, భూరిమాయువు, గోమాయువు, మృగధూర్తకము, సృగాలము, వంచకము, క్రోష్టువు, ఫేరువు, ఫేరవము, జంబుకము, వఱడు.

మన పిల్లలు పాడుకుని ఆనందించే నక్క సామెత మరొకటి ఉన్నది: ఎండా వానా ఒకేసారిగా వచ్చినప్పుడు పిల్లల సంతోషం చెప్పవలనుకాదు. 'ఎండా వానా, కుక్కల నక్కల పెళ్ళి...' అంటూ వాళ్ళు గంతులు వేస్తారు.

నక్కకు మంచి పరిశీలనా జ్ఞానం ఉన్నదని మన పూర్వులు ఏనాడో కనిపెట్టి వున్నారు. దీని పర్యవసానంగా 'నక్కలు ఎరుగని బొక్కలూ, నాగులు ఎరుగని పుట్టలూ ఉంటవా?' అనే ప్రశ్న ఏర్పడింది.

ఈ సందర్భంలోనే భట్టరు చిక్కాచార్యులు చెప్పిన పద్యం:

'నక్కలు బొక్కలు వెదకును
నక్కఱతో నూరబంది యుగడిత వెదకుం

గుక్కలు చెప్పులు వెదకును
తక్కువవా డెల్లయపుడు వప్పులె వెదకున్'

అనగా అనగా ఒక రైతు. అతడు శ్రమపడి పంట పండించాడు. అంతవరకూ ఎంతో జాగ్రత్తగా కాపలా కాసి, తీరా పంటముఖానికి వచ్చేసరికల్లా బద్ధకించి కాపలాకాయటం మానివేశాడు. ఏముంది ?—పండిన పంట యావత్తూ నక్కలు ఆరగించివేశాయి. ఈ నిర్లక్ష్యపు రైతునుంచే 'ఈనగాసి నక్కలపాలు చేసినట్టు' అనే నానుడి పుట్టింది.

ఎవళ్ళయినా తలకు మించిన తగని పరుగులు పెట్ట బోతే, 'ఏమిరా అబ్బాయి : నక్క పుట్టి నాలుగు ఆదివారాలు కాలేదు. అప్పుడే...' అంటూ పెద్దవాళ్ళు మందలిస్తారు.

కొంతమంది కేవలమూ అసాధ్యమైన కార్యాలు తల పెట్టి, అవి నెరవేర్చాలని గాలిమేడలు కడుతూ ఉంటారు. అటువంటప్పుడు ప్రాజ్ఞులూ, అనుభవజ్ఞులూ ఐనవాళ్ళు 'నక్క యెక్కడ, నాకలోక మెక్కడ ? ఎందుకు వచ్చిన ఆలోచనలు ఇవన్నీ' అని చెప్పి అనుకోక మానరు.

నక్క సామెతలలో Psychology ని ప్రదర్శించే గొప్ప సామెతలు కొన్ని వున్నాయి. శ్రీమంతులను చూచి పేదవాళ్లు పోలికలు తెచ్చుకోబోవటం, వారిలాగ వుండటానికి ప్రయత్నించటమూ మనం తరచు చూచే విషయమే. ఎన్ని పోకడలు పోతేమటుకి పేదవాళ్ళు గొప్పవాళ్ళు కావడం మాటలా ? అందుకనే ఇటువంటి అమాయకులపట్ల 'పులిని చూచి నక్క వాత పెట్టుకున్నట్టు' అనేమాట వాడుకలోకి వచ్చింది.

మానవజాతిలో ఒక చిత్రమైన అలవాటున్నది. మానవుడు లోకాన్నంతటినీ తనలాగా మార్చటానికి తాపత్రయ పడతాడు. తనలో కొన్ని లోపాలుంటే ప్రపంచ మంతటినీ లోపభూయిష్ఠంగా మార్చటానికి యావచ్ఛక్తినీ వినియోగిస్తాడు. ఈ సూత్రం ఆధారంగా ఒక చిన్న సంఘటన: దైవికంగా తోక తెగిపోయి అంగవైకల్యం ఏర్పడిన ఒక నక్క తన లోపాన్ని కప్పుకుని, అనుకూలంగా మార్చి చెప్పి — తోడి నక్కలన్నింటినీకూడా తనలాగానే తోకలు తెగకోసుకోమని ప్రబోధించింది.

ఈ 'తోక తెగిన నక్క' కథను శ్రీ కాళ్లకూరి గోపాలరాయ కవి 'అపూర్వ సంఘ సంస్కరణం' అనే పేరిట హృద్యమైన పద్యకావ్యంగా రచించివున్నారు.

నక్కను చూచిన ప్రతివాళ్ళకూ దాన్ని వేటాడాలని బుద్ధి పుడుతుందిట. దీనినిబట్టే 'నక్కను చూచిన వాడెల్లా వేటకాడే' అనే సామెత పుట్టింది.

పెద్దవాళ్ళు ఏదైనా తింటూవున్నప్పుడు సామాన్యంగా పిల్లలు దగ్గర చేరటం పరిపాటి. వాళ్ళను మందలించటానికని, 'ఏమిట్రా! గోతికింద నక్కలాగ కనిపెట్టుకుని వుంటారూ' అనే సామెత ఉపయోగిస్తారు.

ఏదో ఒక ఆశ పెట్టుకునే కదా ఎవరైనా కనిపెట్టుకొని వుంటారు. అలాంటప్పుడు 'వాడి కేదో 'నక్కాశ' ఉందిరా' అనటం కద్దు.

ఒకళ్ళను చూచి ఒకళ్ళు మర్కటీకరించటం మానవ జాతికి సహజసిద్ధమైన గుణం. ఒకరొక పని చేస్తున్నారంటే,

నక్కనున్న వాళ్ళకూడా అనుకరింపజూస్తారు. అవివేకమైన ఈ పనిని మన పూర్వులు చక్కటి సామెతలో ఇమిడ్చిచెప్పారు: “ఊరంతా వడ్లు ఎండబెట్టుకుంటే, నక్క తన తోక ఎండబెట్టుకున్నదట.”

అసలే నక్క, వొళ్ళు బాగులేక మూలుగుతూ వుంది. అందుకు తోడు, అది ఒక తాటిచెట్టుకింద కూర్చునివుండగా దాని నెత్తిమీద గభీమని తాటిపండు ఒకటి పడింది. ఇక దాని బాధ యేం చెప్పేది? ఈ సంఘటననే సమన్వయించి, కష్టాల మీద కష్టాలను ఎదుర్కోవలసివచ్చే వ్యక్తిని గురించి “మూలిగే నక్కమీద తాటిపండు పడ్డట్టు” అని చెప్పడం తరుచు వింటాము.

జీవితంలో మనిషికీ నక్కకూ ఇన్ని పోలికలు ఎందుకు పుట్టాయో తెలియకుండా వుంది. మనిషి నటించే వినయంలో రకాలున్నాయి. అదే కపటంతో కూడుకొన్నదైతే ‘ఏమిటయ్యా, నక్కవినయాలూ!’ అనేస్తారు.

కల్ల కపటాలతో కాలక్షేపంచేసే ముసలివాళ్లను గురించి యువకులు, ‘అడుగో రా వృద్ధజంబుకం’ అంటూ గుసగుసలాడుకుంటారు.

‘చాడీలు చెప్పేవాళ్ళు నక్కజన్మ మెత్తుతా’రని మనలో ఒక నమ్మకం.

నక్క నాలుగుఝాములా కూస్తుందని మరివక వాడుక.

ఒక్కొక్కడు చేసే పనులన్నీ ఎప్పుడూ అస్తవ్యస్తంగానే ఉంటూ వుంటాయి. అప్పుడు ‘నక్క ఒకచోట ఈల వేసి ఒకచోట గౌరీకల్యాణం పాడుతుందా!’ అని అడుగుతారు.

సోమరిపోతులు కొందరు పనీ పాటూ లేకుండా కాల క్షేపం చేస్తూవుంటారు. అటువంటివాళ్ళను చూచి పెద్దవాళ్ళు ఊరుకోలేరు. 'కొంకనక్కలాగా గోళ్ళు గిల్లుకుంటూ కూర్చోక పోతే ఏదైనా పని చూచుకోరాదూ?' అంటారు.

బొత్తిగా శరీరం శుష్కించిపోయినవాళ్ళను చూచి, 'బక్కచిక్కిన నక్కలాగున్నావేమిరా నాయనా?' అని సాను భూతి చూపుతూ ఉంటారు.

తలవనితలంపుగా ఎవరికైనా అదృష్టం కలిసివచ్చినట్ల యితే, 'ఏమిటి, ఇవాళ నక్కతోక తొక్కివచ్చినట్టుందే!' అని అభినందించటం కద్దు.

'నక్క'ను గురించిన మరి కొన్ని సామెతలు:

'అడవి నక్కలకు కొత్వాలు దురాయా?'
'పాడు ఊరికి నక్క తలారి'
'నక్కవాత మన్నుకొట్టినాడు' (ఎత్తుకు పైఎత్తు)
'నక్కగూసి పిల్లలకు దోవ తెచ్చును'
'నక్కజిత్తులన్నీ నాదగ్గరుండగా నన్ను మోసంచేసెనే తాబేటిబుర్ర'
'నక్కపోయిన వెనక బొక్క కొట్టుకొన్నట్టు'
'నక్క రేలకాయ సామ్యం'

పంచతంత్రం—'మిత్రభేదము'లో 'కరటక-దమనకు' లనే నక్కల వృత్తాంతము అతి రమ్యంగా చిత్రించబడివున్నది.

'కుంచములో పోతునక్క కూనలు పెట్టెన్'—అని ఒక చిత్రమైన సమస్య. అయితే నక్కకూ దీనికీ ఏమీ సంబంధం లేదని ఈ కింది పద్యం చూస్తే స్పష్టపడుతుంది:

'మంచివి కుంచెడు సెనగలు
మంచముపై నెండబోసి మరిచితి నిపుడే
పెంచినది పిల్లి యొక్కటి
కుంచములో పోతునక్క కూనలు పెట్టెన్'

ఒకవిధంగా చూస్తే నక్కకూ నరుడికీ ఎంతగానో అవినాభావ సంబంధం ఏర్పడివున్నట్టు స్పష్టమవుతూ ఉంది. ఇంట్లో మందలింపుకీ ఎగతాళికీ నక్కసామెతలు అవసరమై ఉన్నాయి. బిడ్డలు చదివే చిట్టికథలలోనూ, పెద్దలు పఠించే ప్రణయగాథలలోనూ నక్క ప్రత్యక్షమవుతూనే ఉంది.

అడవిలో మృగరాజుకు నక్క లేనిదీ క్షణం గడవదు! అందుకనే నక్కకు 'సింహదూత' ('Lion's Provider) అనే పేరు వచ్చింది.

మృగరాజయిన సింహానికీ, 'సింహదూత' అయిన జంబుకానికీ గల తారతమ్యంగురించి తడవుతూ భాస్కరశతకకర్త ఇలా అంటున్నాడు:

'సిరి పతెనేని సింహ గుహచెంత వసించిన జాలు సింహముల్
కరుల వధింపగా నచట గల్గును దంతచయంబు ముత్యముల్
హరువుగ నక్క బొక్కకడ నాశ్రయ మందిన నేమి గల్గెడుం
గొరిసెలు దూడతోకలును గొమ్ములు నెమ్ములు గాక భాస్కరా'

మన జానపద కథలలో నక్క పరోపకారి. ప్రజ్ఞాధురీణ. త్యాగశీలి. దుష్టశిక్షణకూ శిష్టరక్షణకూ తలపడిన అవతారమూర్తి. ఇంతటి ప్రతిభ గల నక్క మన ఇళ్ళల్లో మసిలేకుక్కకు దాయాదే సుమండీ!

—



# సాహిత్యంలో 'పిల్లి'

ఇల్లు కట్టుకోగానే పిల్లులూ, బల్లులూ చేరతాయి. అందులోనూ పిల్లి కేవలమూ ఋషిగణానికి చెందినటువంటి చతుష్పాత్తు. అది కళ్ళు మూసుకుని ఎంతో పొందికగా ముడుచుకు పడుకొని వుంటుంది.

పిల్లికి గల నామాంతరాలలో కొన్ని యివి : ఓతువు, బిడాలము, మార్జాల(ర)ము-వృషదంశకము, పృషదంశకము, ఆఖుభుక్కు.

పిల్లులలో రకాలు: మానుపిల్లి, నామాల పిల్లి, పునుగు పిల్లి, చెట్టుపిల్లి, జంగుపిల్లి, నీరుపిల్లి, జవాదిపిల్లి, బూతపిల్లి, దేవాంగపిల్లి మొదలైనవి. అయితే చెవులపిల్లిని మాత్రం ఈ జాతిలో చేర్చలేదు శాస్త్రజ్ఞులు.

పరిశుభ్రతకు పిల్లి పెట్టింది పేరు. 'మార్జనం' అంటే శుభ్రం చేయటం. ఎప్పుడూ ఒళ్ళూ పంజాలూ నాక్కుంటూ

శుభ్రంగా వుంచుకోవటం పిల్లికి అలవాటు. దీన్నిబట్టే పిల్లికి 'మార్జార(ల)ం' అనే పేరు వచ్చింది.

రాజకీయ ధురంధరులు తరుచు 'గోడమీది పిల్లి వాటంగా' వ్యవహరిస్తూ వుంటారు. లేకపోతే వారికి క్షణం గడవదు.

జీవితంలో ఒకడికి అపజయాలు కలుగుతూఉంటే అటు వంటి వ్యక్తిని చూచి 'పిల్లిమొగ్గలు' వేస్తున్నా డంటారు.

మనకు బాగా పరిచయమయిన మనిషి చాలా రోజుల తర్వాత తారసపడినప్పుడు 'వాడు పాతపిల్లేరా' అంటాం.

పరమ లోభినిగురించి సామాన్యంగా 'వాడు పిల్లికి బిచ్చం పెట్టడు' అని చెప్పుకొంటారు.

ఒక లక్ష్యం లేకుండా వ్యర్థంగా తిరిగేవాణ్ణి 'ఎందు కబ్బాయ్, కాలుకాలిన పిల్లిలా అలా తిరుగుతావు?' అని మందలిస్తారు.

కఠినుడయిన ఉద్యోగి ఉంటాడు. ఆయనదగ్గిర ధైర్యం చేసి ఏదైనా చెప్పుకోవాలన్నప్పుడు ఎవరు చొరవచేసి ముందు వెళ్ళటం? అని ప్రశ్న వస్తుంది. దీన్నే 'పిల్లికి గంటకట్టేవా రెవరు?' అని అడగటం కద్దు.

ఎవరైనా అతి మంచిగా వుంటే ఇతరులు అలుసు చేసి స్వారిచేయటానికి చూస్తారు. అటువంటి సందర్భంలో 'పిల్లి గుడ్డి దయితే ఎలుక ఒంటికాలుతో నాట్యం చేసిందిట' అనే సామె తను ఉపయోగిస్తారు.

కొందరు సోమరిపోతులు ఏమీ తోచక ఏదో పాడుపని చేస్తూఉంటారు. అటువంటివాళ్ళను చూసి 'పనిలేని మంగలి పిల్లితల గొరిగాడట' అని అంటారు.

కొంతమంది అతి తెలివిమంతులు తాము చేసే పనులు ఇతరులు గ్రహించలేరనుకుంటారు. పిల్లికూడా అలాగే. అది 'కళ్ళుమూసుకు పాలుతాగితే ఎవరూ చూడలే'దనుకుంటుంది.

కొందరికి గడ్డం బాగా పెరుగక మునిముందర కొంచెంగా వుంటుంది. దీన్ని 'పిల్లిగడ్డం' అని పిలుస్తారు.

ఒక పెద్దమనిషికి డబ్బు నాసి వచ్చిందనుకుందాం. ఆయన పొరుగింటికి వచ్చి "మాఁవా! ఒక్క రూపాయ బదులియ్యి వయ్యా - రేపన్ తెస్తేగాని 'పొయ్యిలో పిల్లి' లేవదు" అని చెప్పి అర్థిస్తాడు.

'పిల్లి పిల్లల్ని పెట్టి ఏడిళ్ళు తిప్పుతుం'దంటూ నిలకడ లేనివాళ్ళను నిందిస్తారు. అది ఇలాగ ఏడిళ్ళు తిప్పటానికి కారణం గండుపిల్లి భయమే.

పిల్లి ఈవిధంగా పిల్లల్ని తిప్పేటప్పుడు చాలా మెలకువగా ఉంటుంది. కూనకు నొప్పి తగలకుండా నోట కరుచుకు తీసుక పోతుంది. అంటే పిల్ల బాధ్యత యావత్తూ తల్లిమీదనే ఉన్న దన్నమాట. భగవంతుణ్ణి నమ్ముకున్న భక్తుడుకూడా ఇదే విధంగా ఉండాలని శ్రీ రామకృష్ణపరమహంసవారు చెప్పారు. దీన్నే 'మార్జాలకిశోర న్యాయం' అంటారు.

రెండు పక్షాలవాళ్ళు కయ్యాలాడుకుని పెద్దమనిషివద్దకు వెళితే అతడు మధ్యవర్తిగా వుండి ఇద్దరినీ ముంచి తన లాభం

చూసుకుంటాడు. దీన్నే 'పిట్టాపిట్టా పోరు పిల్లితీర్చె' నంటారు. ఈ సందర్భంలో చెప్పే 'రెండు పిల్లులూ - కోతీ' కథ పిల్లలంద రకూ తెలుసు.

తెనాలిరామలింగడు ఒకప్పుడు రాయలువారు ఇచ్చిన పిల్లికి ఉడుకుడుకుపాలు పోశాడట. నాటినుంచీ పాలు చూసే టప్పటికే ఆ పిల్లి హడలిపోయేది. దీన్నిబట్టే 'బాచిగాడి పిల్లి' అనే జాతీయం వచ్చింది.

పూర్వం ఒక బ్రాహ్మడుండేవాడు. సిరీ సంపదా, పాడీ పంటా అన్నీ కలవాడు. మంచి ఆచారపరుడు. తద్దినం వచ్చిం దంటే పిల్లులు పాలూ, పెరుగూ ముట్టుకుంటే పనికిరావని వాటిని కట్టేస్తూండేవాడు. క్రమంగా తరువాతి తరాలవాళ్ళలో, సిరి సంపదలు పోయినా ఈ ఆచారంమాత్రం పోక ఆనుపూర్వికంగా వస్తోంది. పాడి లేనప్పుడు పిల్లు లెక్కడుంటాయి ?

ఒక రోజున పిల్లి ఎక్కడా దొరకలేదు. ఇంకెలాగ___ తద్దినం చెడిపోయిందిగదా అని ఆలోచిస్తూండగా___"తద్దినా నికి బ్రాహ్మడు లేకపోతే గంధపుచెక్కతో సరిపెట్టుకుంటు న్నామా లేదా ? అలాగే మట్టిపిల్లిని చేసి తద్దినం పెడితే సరి" అని పిల్లిని చేసి వంశాచారప్రకారం కట్టేశాడు.

దీన్ని చూసిన ఒక బుద్ధిశాలి : 'వీళ్ళు పూర్వం గొప్ప పాడీ పంటా గలవాళ్ళు. తద్దినాన్ని అభాసు చేస్తాయని పిల్లులను కట్టేసేవాళ్ళు. ఇది చివరకి మూఢాచారంగా పరిణమించింది' అనుకున్నాడు. అర్థంలేని సంప్రదాయాల్నిగురించి చెప్పవలసి వస్తే 'పిల్లిని కట్టెయ్' అనే ఈ కథ జ్ఞాపకానికి వస్తుంది.

పిల్లులు ముట్టుకుంటే పితృకార్యం చెడిపోతుంది. అందుకనే మన తెలుగువారి తిట్టులలో 'నీ పిండం పిల్లులకు పెట్టా'! అనేది ఒకటి వుంది.

మన ప్రాచీన సారస్వతంలో 'దీర్ఘకర్ణము' అనే పిల్లికథ హితోపదేశంలో చక్కగా చిత్రింపబడివున్నది.

పిల్లల 'దాగుడుమూత'లలో కూడా పిల్లికి స్థానం వుంది :

'దాగుడుమూత దండాకోర్
ఎక్కడ దొంగ లక్కడే
పిల్లివచ్చె ఎలకా దాక్కో
గప్ చిప్'

'పిల్లి అశుభం కోరే జంతు'వని భారతీయుల నమ్మకం. అందుకనే మన సారస్వతంలో పిల్లిచరిత్ర చాలావరకూ ప్రతికూలంగానే కనబడుతూంది.

యజమానికి 'పిల్లి కళ్ళు పోగోరుతుంది ; కుక్క పిల్లలు కలగగోరుతుంది' అని ఒక సామెత.

ప్రొద్దుట లేవగానే పిల్లిని చూస్తే రక్తం కళ్ళచూడవలసి వస్తుందని ఒక నమ్మిక.

ఎక్కడికయినా బయలుదేరినప్పుడు పిల్లి ఎదురయితే అది దుశ్శకునంగా భావిస్తాము.

ఏదైనా శుభకార్యం చెడిపోయిన సందర్భంలో 'పీటల మీద పెళ్లికి పిల్లి ఎదురు' అంటారు.

ఒకపని చెరిపేవాణ్ణి ఎక్కడకైనా కూడా తీసుకువెళ్లితే, 'పిల్లిని చంకపెట్టుకు వచ్చావేమిరా' అని అడుగుతారు.

చూడటానికి పిల్లి సాధువుగానే వుంటుందిగాని కోపం వస్తేమట్టుకి రెచ్చి గుడ్లు పీకుతుంది. కనుక పిల్లినిగురించి చాలా జాగ్రత్తగా ఉండాలి. ఈ సందర్భంలో దుష్టుల్ని చేరదీస్తే 'తిన్నయింటి వాసాలు లెక్కడతా'రనడానికి 'కూన అని పెంచితే గండు ఐ కరవవచ్చిందట' అని పిల్లి స్వభావంతో పోలుస్తారు.

ఒకనికి సరదాగా ఉండే పని మరొకనికి బాధాకరంగా ఉండే సందర్భాన్ని 'పిల్లికి చెలగాటం—ఎలక్కి ప్రాణసంకటం' అంటారు.

తప్పు చేసి, రెండోకంటివాడికి తెలియకుండా గప్‌చిప్‌గా ఎవడైనా అదృశ్యమయినప్పుడు 'చడీ చప్పుడూ కాకుండా పిల్లిలా జారిపోయాడే' అంటారు.

ఏదైనా ఒక రహస్యం బట్టబయలయిన సందర్భాన్ని-'The cat is let out of the bag' అంటారు-ఇంగ్లీషులో.

చేతికి వచ్చిన తరుణాన్ని వినియోగించుకోలేక చెడగొట్టు కొన్నవాణ్ణిగురించి ''తాగలేని పిల్లి బోర్ల పోసుకుందిట'' అని చెప్తారు.

దొంగవేషాలు వేసి మంచిని నటించేవాళ్ళను 'రుద్రాక్ష పిల్లి' అని పిలుస్తారు.

కొంతమంది మనుషులికి 'పిల్లికళ్ళు' ఉంటాయి. నీళ్ళు వేడి తక్కువగా ఉంటే బొత్తిగా 'పిల్లుచ్చలు'గా ఉన్నా యంటారు.

ఒక వ్యక్తి తను క్షేమంగా వుంటూ ఇతరులకు ప్రాణాంతకమైనా సరే, వాళ్ళవల్ల పనులు నెరవేర్చుకుని తను లాభం

పొందజూస్తాడు. దీనికి ఒక చిత్రమైన పిల్లి పోలిక వుంది! ఒక కోతి పొయ్యిలో జీడిగింజలు పడవేసింది. అవి బయటకు తీసుకుందామంటే దానికి ఉపాయం తోచలేదు. దారే పోయే పిల్లి నొకదాన్ని చూసి "జీడిగింజలు తీసుకు తిందాం రా"మ్మని పిలిచింది. అప్పుడా కోతి పిల్లిని పొందికగా ఒళ్ళో కూచోబెట్టుకుని, దాని కాలితో నిప్పులోంచి గింజలు తీసుకుంది. పిల్లి ఏడ్చి మొత్తుకున్నా అది గింజలన్నీ తీసుకునేవరకూ వదలలేదు.

అన్నట్టు—'పిల్లి పులికి మేనమామ'. పులికి పిల్లి అన్ని విద్యలూ నేర్పింది కాని, చెట్టెక్కడంమాత్రం నేర్పిందికాదు. ఎందుకంటే ఆ ఒక్కటీ కూడా నేర్పేస్తే, ఎప్పటికైనా పులి తనకే ద్రోహం తలపెడుతుందని భయం.

'తడి పంజాతో పిల్లి చెవుల సందున తుడుచుకుంటే 'అది వర్షం పడే సూచన' అని ఒక నమ్మకం.

పిల్లి తలమీద నూనెచుక్క పడితే అది గుంజుకుపోయి చికాకుపడుతుంది; తల రక్కుకుని చావ సిద్ధమవుతుంది. ఇటువంటి పరోక్షహింసను "మార్జాలాభ్యంజనం" అంటారు.

'పిల్లి' సంబంధమైన మరి కొన్ని సామెతలూ, జాతీయాలూ, పోలికలూ :—

'ఎలుకకు పిల్లి సాక్షి'
'అగడ్తలో పడ్డ పిల్లికి అదే వైకుంఠం'
'మానుపిల్లో, మట్టిపిల్లో ఎలుకను పట్టితే సరి'
'నా యింటికి నేనే పెద్దను; పిల్లికి పెట్టరా పంగనామం'
'పిల్లి శాపాలు' (నిరర్థకమైన శాపాలు)
'ఇంటి పిల్లికి పొరుగింటి పిల్లి తోడు'

'వైదికపు పిల్లి ప్రత్తి ప్రలకవే అంటే మావుమావు అందిట'
'పిల్లికి రొయ్యల మొలతాడు కట్టితే, అమంటా బోయి
నోట్లో వేసుకుందిట'
'పిల్లిని చంపిన పాపం నీది, బెల్లం తిన్న పాపం నాది'

పిల్లినిగురించి మనం ఎంత చెడ్డగా చెప్పుకొన్నప్పటికీ పిల్లులలోకల్లా నల్లపిల్లి (కృష్ణమార్జాలం) కొంత నయమని మన వాళ్ళంటారు. మనవాళ్ళయితే సందేహించారేకాని తెల్లదొర లకి నల్లపిల్లి చాలా శుభప్రదం. కానినాట్ ప్రభువు భారత దేశపు ప్రయాణంలో శుభశకునంకోసం కొన్ని సాలెపురుగులతో పాటు ఏడు నల్లపిల్లుల్ని వెంటబెట్టుకు వచ్చాడు.

ఇంతగా మనకి కంటసంగా వుంటున్న పిల్లులకు విదేశా లలో ఎంతటి గౌరవమున్నదో తెలుసుకోవటానికి ఆశ్చర్య మవుతుంది. పూర్వం ఈజిప్టుదేశస్థులకు పిల్లులంటే చెప్పలేని ప్రేమ. అక్కడ ధాన్యం కావలి కాయటానికీ, వేటలో పాల్గొన టానికి పిల్లులే. నీటిపక్షుల్ని వెంటతరిమి పట్టుకోవటంలో వారు పిల్లుల్ని తరిఫీదు చేసేవారు. తమ యజమానులను అనుసరించి పిల్లులు యుద్ధభూమికికూడా వెళ్లేవి. అలా యుద్ధరంగమందు మరణించిన మార్జాలరాజులను స్వదేశానికి తీసుకవచ్చి, పవిత్ర స్థలాల్లో సమాధి చేసేవారు. పిల్లి చనిపోయిందంటే, విచారాన్ని తెలిపేటందుకని ఈజిప్షియన్లు కనుబొమలు గీయించుకునేవారు.

ఈజిప్టులో పిల్లిని చంపితే కఠినశిక్ష విధింపబడేది.

పర్షియా చక్రవర్తి ఒకసారి ఒక తమాషా చేశాడు. తన సైన్యంలో ముందుగా నడిచేవాళ్ళకి తలకొక పిల్లినీ సంపా దించి యిచ్చాడు. ఈజిప్షియనులకు పిల్లిఅంటే భక్తికదా!

అందుచేత, పిల్లుల మరణానికి ఒప్పుకోలేని ఈజిప్టుదేశస్థులు పర్షియన్లకు లొంగిపోవలసి వచ్చింది!

పిల్లుల చరిత్ర చైనాలో ఐదవ శతాబ్దినుండి ప్రారంభం. పదవ శతాబ్దిలో చైనాపిల్లులు కొన్ని జపానులో ప్రవేశపెట్టబడినై. ఆనాడు జపానులో పిల్లులు అరుదు. ఒక్క రాజ కుటుంబాలు తప్ప సామాన్యులు పిల్లుల్ని పెంచలేకపోయేవారట. జపానులోకూడా పిల్లిని చంపినవాళ్ళు వంశనాశనం ఐపోతారని ప్రబల నమ్మకం.

చీనాదేశంలో పిల్లుల్ని పెంచడంలో ఒక స్వలాభాపేక్ష ఉన్నది: అవి పట్టుపురుగుల్ని ఎలకలు తినివేయకుండా కాపాడతాయి. బ్రతికివున్న పిల్లులు దొరకనినాడు వారు ఎలకల్ని తరుముటలో పిల్లుల బొమ్మలు తయారుచేసి ఉపయోగించేవారు!

జానపద కథాసాహిత్యంలో పిల్లి నెత్తిన దీపంపెట్టి వేశ్యలు రాజకుమారులతో జూదమాడటం, వారిని ఓడించి బానిసలుగా చేసుకోవటం తరుచు కనబడుతుంది.

నెపోలియన్, సీజర్ జంగిస్‌ఖాన్ ప్రముఖులకు 'పిల్లి' అంటే ఏవగింపు. జార్జి వాషింగ్టన్, అబ్రహాం లింకన్ మహాశయులు పిల్లిని ప్రాణంగా చూచేవారు.

మన పూర్వుల నమ్మకలు ఎలా వున్నప్పటికీ, ఇంటింటా తిరిగే పిల్లి చూడ ముచ్చటగానే వుంటుంది. అందుకనే ఒకానొక కవి పిల్లిని 'సకల గృహావర్తి మార్జాల చక్రవర్తి' అంటూ గొప్పగా ఇలా వర్ణించాడు:

'క్షీరఘటాంబుధిస్థితి కుంభ సంభవ
బహుమూషకోరగ పక్షిరాజ
శుకకుల మత్తేభ నికర కంఠీరవ
శలభ సంకుల వనజ్వాలి కీల
వృశ్చికదానవ విష్ణు సుదర్శన
వాయసమేఘ దుర్వారపవన
కుక్కుట పర్వతఘోర వజ్రాయుధ
రౌద్రాంధకార మార్తాండతేజ
వ్యాఘ్రకులమాతులస్వామి శీఘ్రగమన
పైసములదొత్తి దొత్తుల పాలి మిత్తి
రమ్యతరమూర్తి నఖరసంప్రాప్త కీర్తి
సకల గృహవర్తి! మార్జాల చక్రవర్తి!'

ఇటువంటి సాధుజంతువయిన పిల్లిని కొట్టటానికే చేతులు రావే. అటువంటప్పుడు మన పెద్దలు 'పిల్లిని చంపితే బ్రహ్మహత్య' అని అనటంలో ఆశ్చర్య మేమున్నది!



# సాహిత్యంలో 'ఎలుక'

చూపులకు చిన్నదే కావచ్చు. కాని, ఎలుకనుమాత్రం చిన్న చూపు చూడటానికి ఎంతమాత్రం వీల్లేదు. ఏమంటే—ఎలుకతో మనకు గల సన్నిహిత సంబంధం అటువంటిది. ఎలుక ఇంటికి 'రక్ష'. ఎలా అంటారా :

పసిబిడ్డడు యేడిచి మారంచేస్తూవుంటే తల్లి 'నాయనా ! ఏడవకురా, ఎలక నడిగి తాయిల్లం తెచ్చిపెడతాను' అంటుంది. పిల్లవాడికి పన్ను ఊడిపోతే, దాన్ని ఎలుకకన్నంలో పడవేసి, 'ఎలకా, ఎలకా ! నా పాతపన్ను పుచ్చుకుని నీ కొత్తపన్ను నాకియ్యేం !' అని అడుగుతాడు. ఇవి కేవలమూ సాంసారిక విషయాలు.

ఎలుకకు దేవగణంతో గల సంబంధం తలచుకుంటే, దానిపైన మనకు ఎంతటి పవిత్ర భావమైనా కలుగుతుంది. అది మన ఆదిదేవుడైన గణపతికి వాహనమే ఐవుందికదా మరి? భాద్రపదమాసంలో వినాయకునికి, వినాయకునితోపాటు ఎలుకకున్నూ పూజలు చేస్తాము. అసలింతకూ ఎలుక గణపతికి ఎలా వాహన మయింది?—

పూర్వం 'గజముఖు'డనే రాక్షసుడు చావు లేకుండా శివునివల్ల వరం పొందాడు. వరం పొందగానే వాడికి అహంకారం ఎక్కువైంది. ఎక్కువై, ఇంద్రుడిమీదికే దాడివెళ్లాడు. దేవగణమంతా తనఎదుట రోజూ గుంజీలు తీసి మరీ పోతూండాలని ఆజ్ఞాపించాడు. ఈ హింస భరించలేకపోయారు దేవతలు. పోయి శివునితో మొరపెట్టుకున్నారు. శివుని అభీష్టప్రకారం వినాయకుడు, తన దంతాలలో ఒకటి ఫళుక్కున విరిచి మంత్రపూరితంగా ప్రయోగించి వదిలేసరికి అది గజముఖుణ్ని పీచె రేగగొట్టింది. తట్టుకోలేక గజముఖుడు ఎలుకగా మారి ఒక్కకన్నంలో దూరాడు. వినాయకుడు జాలిపడి, 'బుద్ధితెచ్చుకుని నీ లోకానికి నీవు పోయి బతుకు!' అనేసరికి గజముఖుడు 'మహానుభావా! నీకు నేను దాస్యంచేసి తరిస్తాను. కాని మునుపటిలాగే దేవగణం నా ఎదుట గుంజీలు తీయటంలోమటుకు నీవు అడ్డురావద్దు. ఏమంటే, పూర్వం నా వాళ్ళను దేవతలు పెట్టివున్న బాధలకు ప్రతిఫలమే నేను కోరే ఈ కోరిక' అని విన్నవించాడు. ఈ పద్ధతికి వినాయకుడు కాదనలేదు. అప్పటి నుంచీ గజముఖుడు మూషకరూపంలో వినాయకునికి వాహనమై ఆయనను మోసుకు తిరుగుతున్నాడు.

ఇంతటి మహత్తరమైన ఎలుకనుగురించి ఆవేశం కలిగిన ఒక కవిపుంగవుడు దాని నిలా వర్ణించివున్నాడు :

"నిర్ణిద్ర విషయుక్త నిశిత దంష్ట్రల బూని
భేదించు నెటువంటి గాదెలైన
దారుణోద్యద్దంత తతిచేత ఖండించు
గుజుతుగా నెటువంటి కోకలైన
పటుసురంగాగార భరితంబుగా ద్రవ్వు
బొంకాన నెటువంటి భూమినైన
కీచుకీచుధ్వని ప్రాచుర్య మహిమచే
వర్ణించు నెటువంటి వారినైన,
అతడు సామాన్యుడే నరేంద్రాలయాంత
రంతకానేక పేటికా క్రాంతవస్తు
హరణ సురధాణి యవ్వినాయకు పతాణి
చారుతరమూర్తి మూషక చక్రవర్తి"

బాగానే వుంది కవివర్ణన. కవివర్ణనే గాదు, అసలు 'మూషిక' మనే పదంలోనే 'దొంగ' అనే భావం ధ్వనిస్తున్నది. 'ముష్' అనగా చల్లగా కాజెయ్యటం. దీన్నిబట్టే ఎలుకకు మూషికం అనిపేరు.

చిత్రమైన ఈ ఎలుక అనేక రకాలు :

చిట్టెలుక, చూరెలుక, చుంచెలుక, నల్ల ఎలుక, కల్లెలుక (రాళ్ళలో వుండేది) మెట్ట ఎలుక, సౌరపంజిగాడు, (తుప్పలలో నివసించేది) అడవి ఎలుక, తెల్ల ఎలుక, సీమఎలుక మొదలైనవి. నాగుఎలుక అనేది అతి విషపూరితమైందీ, ప్రమాదకరమైనదిన్నీ. ఇవన్నీ గాక హిందీలో 'కేదారబాలమూషిక' మనే పేరుగలది ఒకటున్నది. 'తొండ ముదిరి ఊసరవెల్లి అయిం'

దన్నట్టుగా, ఎలుక ముదిరి పందికొక్కు అవుతుందని చాలా మంది భ్రమ. కాని ఇది పొరపాటు. పందికొక్కు అనేది ఒక ప్రత్యేకజాతి.

ఆయా ఎలుకల నామాంతరాలు కొన్ని ఇక్కడ పేర్కొంటాను:

ఖనకము, అధోగంతము, ఉందురము, ఉందురువు, మూషి(ష)కము, ఆఖువు—ఎలుక, పందికొక్కు.

గిరిక, బాలమూషికము—చిట్టెలుక.

చుంచరి, చుచుందరి (ధాన్యాలను ఛేదించేది); గంధ మూషికము—చుంచు.

దీర్ఘదేహి—పందికొక్కు.

ఎలుకకు అరవం 'ఎలి' (పిట్టెలి). కన్నడం 'ఇలి' (మనె ఇలి). ఈ మాటలన్నీ 'ఇల్లు' అనే పదాన్నుంచి పుట్టినవే. ఇంట్లో ఎలుకకు స్వాధీనం కానిదేదీ లేదు.

మానవుడు అజాగ్రత్తగా వుంటే వస్తువులను 'ఎలకలూ చిలకలూ కొట్టివేస్తాయి.'

రోషపూరితుడైన మానవుడు 'ఎలుకలున్నంతమాత్రాన ఇల్లు తగులబెట్టుకుంటా' ననటం పరిపాటి. ఇది అజ్ఞానం కాక మరేమిటి ?

'గాదెకింది ఎలకలు గాదెకిందనే బతకాలిగా ? వేరే ఎక్కడికి పోతాయి ?' అనేది మరొక సమస్య. ఇది సామాన్యంగా లంచగొండులైన ఉద్యోగస్థుల గురించి 'గాదెకింది పందికొక్కులు' అని వాడటం మామూలు.

బ్రహ్మాండమైన పని నిర్వహించి చిన్న ఫలితం పొందినప్పుడు 'కొండత్రవ్వి ఎలుకను పట్టినాడురా!' అంటారు వేళాకోళంగా. ఇదే సంస్కృతంలో 'గిరి ముత్పాట్య మూషికో ధృతా' అని వాడబడుతున్నది.

కొండ, ఎలుక—అనేసరికి ఒక సంగతి జ్ఞాపకానికి వస్తుంది. ప్రతిభాశాలి, ఏకచ్ఛత్రాధిపతి అయినటువంటి శివాజీ చక్రవర్తిపై అసూయపడిన ఔరంగజేబు అతనిని ఏమీ చేయలేక 'కొండఎలుక' అని పేరుపెట్టటంతో తృప్తిపడ్డాడు.

భయంకరమైన మహామ్మారి వ్యాధి రాబోతుందనగా ముందు అది ఎలుకలపైన ప్రతిఫలిస్తుంది. వ్యాధి సోకగానే ఎలుకలు చచ్చి చూరునుండి కిందకు పడతాయి. ఇది తెలుసుకుని ఆ ప్రాంతస్థులు తగు జాగ్రత్తలు వహిస్తారు.

భూలోకమందు చెరసాలలో ఒంటిపాటు జీవితం గడపిన బందీలకు ఎలుకలే ప్రాణమిత్రులైన వింతసంఘటనలు ఎన్నో వున్నాయి కథాసారస్వతంలో. అందులో ఫ్రెంచిఖైదీ 'లాటూర్యాడ్డు' ఉదంతం పేర్కొనతగింది.

ఇంగ్లీషులో Pied Piper of Hamelein అనే ఎలుకల కథ సుప్రసిద్ధమైందీ, వినోదపూరితమైందీ, విజ్ఞానదాయకమైందిన్నీ. ఇది తెలియని విద్యార్థులుండరు.

మన ప్రాచీన వాఙ్మయంలో ఒక వినోద సమస్య వున్నది. 'ఎలుకలు తమ కలుగులోని కేనుగు నీడ్చెన్ !' అని. దీన్ని బుద్ధిమంతులు ఇలా పూరించారు :

'ఇలలో నిద్దరు రాజులు
మలయుచు జదరంగ మాడి మాపటివేళన్

బలమెత్తి కట్టమఱచిన
నెలుకలు తమ కలుగులోని కేనుగు నీడ్చెన్.'

నమ్మతగని ఒకరిని గూర్చి, మరిఒక నమ్మతగనివాడు చెప్పవచ్చినట్టయితే 'ఎలక్కి పిల్లి సాక్ష్యమా ?' అనటం కద్దు.

గీర్వాణ వాఙ్మయంనుంచి ఎలుకను గురించిన లోకోక్తులూ, గాథలూ కొన్ని :

'ఆఖ్వన్న పిటకన్యాయం'లో దుష్టుణ్ని ఎలుకను పోల్చారు. ఎలా అంటే ఎలుక అన్నమును కిందికి పడదోయ గలదే కాని దాన్ని తిరిగీ ఎత్తలేదు. అలాగే దుష్టుడు కార్యం చెడగొట్టగలడే కాని, దానిని చక్కబరచలేడు.

ఒక కర్రకు కొన్ని అపూపాలు కట్టివుంచారు. 'ఒక ఎలుక ఆ కర్రను కొరికింది' అని చెప్పినప్పుడు, అపూపాలు కూడా కొరికి తిన్నదని వేరే చెప్పవలెనా ? దీన్నే 'దండాపూప న్యాయం' అంటారు.

'మంజూషాఖున్యాయం' అనేది చిత్రమైంది. పాముల వాడు పెట్టెలో పామును ఉంచాడు. అందులో ఏదో తిండివుందని తలచి ఒక ఎలుక ప్రవేశించగా పాము దానిని తినివేసింది! ఇష్టార్థసిద్ధి కలుగుతుందని అనుకొన్నప్పట్లో అనిష్టం సంభవించి నప్పుడు ఇది వాడతారు.

ఇదే భావాన్ని భర్తృహరి తన 'దైవపద్ధతి'లో ఇలా చెబుతున్నాడు :

'రాతిరి మూషకంబు వివరం బొనరించి కరండబద్ధమై
భీతిలి చిక్కి యాస చెడి పెద్దయు డస్సిన పామువాత నం

పాతము జెందె దాని దిని పాము దొలంగె బిలంబు త్రోవనే
యేతఱి హానివృద్ధులకు నెక్కటి దైవమ కారణంబగున్'

'మూషక విషాణన్యాయం' అనగా ఎలుకకు కొమ్ములు వచ్చినట్టు అని భావం. అసంభవం అనే భావం చెప్పటానికి ఉదహరించేది ఇది.

చుంచు అనేది చిన్న ఎలుక. అది పరుండిఉన్నవారి పాదాలను మెల్లగా కరుస్తుంది. అలానే రాజుకూడా ప్రజకు నొప్పి తెలియకుండా పన్నులు గ్రహించాలి. ఈభావం 'శల్యక వానాఖున్యాయం'లో ఇమిడివున్నది.

'స్వజాతిర్దురతిక్రమా': ఇది ఒక వినోదమైన గాథ— ఒక మునీశ్వరుడు అర్ఘ్యమిస్తూవుండగా దోసిట్లో ఒక ఎలకపిల్ల పడింది. ఆ ముని దాన్ని కనికరించి మానవకన్యగా మార్చాడు. కన్యకు పెళ్లీడు వచ్చింది. అప్పుడు ఆయన సూర్యుణ్ని, మేఘుడిని, వాయుదేవుడిని, పర్వతుణ్ని పిలిచి వీరిలో ఒకరిని వరించుమన్నాడు. ఆమె సూర్యుడు వేడిగా ఉన్నాడనీ, మేఘుడు నల్లగా ఉన్నాడనీ, వాయుదేవుడు చపలుడనీ, పర్వతుడు కఠినుడనీ చెప్పి వారినెవ్వరినీ ఒల్లలేదు. అప్పుడు ముని ఒక ఎలుకను తెచ్చి పెళ్ళాడుతావా? అని అడిగేసరికి, ఆమె వెంటనే అంగీకరించింది. పూర్వంలాగా ఆమెను మళ్ళీ ఎలుకగా మార్చివేశాడు ముని. ఎవడూ తన జాతిని విడిచిపెట్టి పైగా పోలేడని ఇందువల్ల విశదమవుతున్నది.

'చూడ చుంచెలుక, గోడ త్రవ్వ పందికొక్కు'

అని ఒక వాడుక ఉన్నది. చుంచులాగా చూపులకు చిన్నగా వుండి ఎంత పనైనా చేయగలవాళ్ళకు ఇది వర్తిస్తుంది.

ఎలుకను గురించిన మరి కొన్ని తెలుగుసామెతలూ, జాతీయాలున్నూ :—

'ఎలుక ఎంత యేడ్చినా పిల్లి తన పట్టు వదలదు.'
'ఎలుకకు పిల్లి పొంచి వేసినట్టు.'
'ఎలుక చావుకి పిల్లి మూర్ఛపోనా!'

'ఎలుక యేట్లో పోతేనేం,
పులి బోనులో పోతేనేం?'

'తూమెడు వడ్లు తూర్పార బెట్టేటప్పటికి
ఏదుం వడ్లు ఎలుకలు తినిపోయినై.'

'పందికొక్కు చేష్టలు'
'వడ్లగాదెలో పందికొక్కును పెట్టినట్టు.'

పంచతంత్రంలోని 'హిరణ్యకు'ని కథ, కథాసరిత్సాగరంలోని ఎలుకసెట్టి కథ, కేయూరబాహుచరిత్రలోని 'అహిమూషకోపాఖ్యానమూ' కథాసారస్వతంలో పేరెన్నిక గన్నవీ, చదివితీరవలసినవిన్ని.

ఎలుకతో పోలుస్తూ ఒక కవికుమారుడు "ఇద్దరుభార్యల మగడి" పాట్లు ఎంత తమాషాగా చెప్పాడో చూడండి!

'బిలము వెలుపల మార్జారి, బిలములోన
సర్ప మీమధ్యనున్న మూషకము కరణి
భార్యలిరువురు గలయట్టి భర్త భువిని
కదలలేక మెదలలేక కలగువాడు!'

'బాలవాఙ్మయబ్రహ్మ' మన చింతాదీక్షితులుగారు పసివాళ్లకు అతి వినోదమైన బలే పరీక్షపెట్టారు. ఈ

గేయాన్ని తడబడకుండా - గబగబ గబగబా - తొందర తొందరగా చదవాలట !—పసివాళ్ల కేమిటి, పెద్దలకుమాత్రం ఇది సమస్యకాదా ?—చూడండి :

"గాదెక్రింద పందికొక్కు
గాదెలోని కందిపప్పు
నక్కినక్కి బొక్కుచుండె ;
కందిపప్పు పందికొక్కు
ముట్టిపెట్టి బొక్కుచుండె.

గాదెలోని కందిపప్పు
గాదెక్రింద పందికొక్కు
బొక్కుచుండ ప్రక్కనున్న
అక్కవచ్చె ; ఆమె చూచి
పందికొక్కు కందిపప్పు
విడిచిపెట్టి పారిపోయె !"



# సాహిత్యంలో 'ఆవు'

మన పూర్వులు మానవజాతిని కులాలుగా విభజించారు. అన్ని విధాలా ఆదర్శప్రాయమైనటువంటివారిని బ్రాహ్మణులన్నారు. బ్రాహ్మణత్వం అనగా పవిత్రత్వానికి చిహ్నమన్నమాట. అందుకనే 'బ్రాహ్మణ' శబ్దం ఉన్నతస్థాయికి మొట్టమొదటగా ఉటంకించబడుతూవుంది. ఐతే— అటువంటి బ్రాహ్మణునికంటెకూడా ముందుగా పేర్కొనదగినది 'గోవు'. 'గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం' అనికదా నిర్వచింపబడివుంది!

ఈవిధంగా తొలిపూజ లందుకొంటున్న గోవును గురించి ఎన్నెన్నో గొప్పవిషయాలు మన సారస్వతమందు గోచరించటంలో ఆశ్చర్యంలేదు.

ఐతే, నిజానికి—గో బ్రాహ్మణులకు తర తమ భేదం లేనే లేదు. ఉభయుల అవసరమూ లోకానికి సమానంగానే వుంది. పూజ సల్పటానికి బ్రాహ్మణుడూ, పూజాద్రవ్యాలు సమకూర్చ టానికి గోవూ ఒకేమారు బ్రహ్మవల్ల సృష్టింపబడ్డట్టు పురాణాలు చెబుతున్నాయి.

చ్యవనుడు గంగా యమునా నదులు కలిసేచోట నీటి లోనే ఉండి పన్నెండేళ్లు తపస్సు చేశాడు. ఒకనాడు చేపల కోసం జాలరులు వలవేయగా చేపలతోపాటు చ్యవనుడుకూడా వలలో పడ్డాడు. బెస్తవాళ్లు భయపడి క్షమించవలసిందని అత నిని కోరారు. అందుకు చ్యవనుడు 'పన్నెండేళ్లుగా చేపలతో ఉండిన నేను వాటితోనే ప్రాణం విడవటం న్యాయం. చేపలతో పాటు నన్నుకూడా తగిన ధరకు అమ్ముకోండి' అన్నాడు.

జాలరులు తమరాజు నహుషునికి జరిగినదంతా విని పించారు. రాజుకూడా అక్కడికివచ్చి చ్యవనుని వేడుకున్నాడు. అప్పుడు చ్యవనుడు 'రాజా! జాలరులు తమ కులవృత్తి చేయడం తప్పుకాదు. వాళ్లకి తగిన వెల యిచ్చి నా శరీరం పుచ్చుకో' అని బదులు చెప్పాడు. రాజు వేయి మాడలిచ్చాడు. అది తన విలువకు సరికాదని చెప్పాడు చ్యవనుడు. రాజు కోటి మాడలు, అర్ధ రాజ్యం, చివరకు తన రాజ్యమంతా ఇస్తా నన్నాడు. చ్యవనుడు ఇదివరకు లాగానే జవాబిచ్చాడు. నహు షుని కేమీ తోచిందికాదు. అప్పుడు గవిజాతుడనే ముని అక్కడకువచ్చి 'రాజా! బ్రాహ్మణుని కులమూ గోవు కులమూ ఒక్కటే. ప్రపంచంలో బ్రాహ్మణునితో సమానమయింది గోవు ఒక్కటే' అని చెప్పాడు.

రాజు చ్యవనునితో 'మునివరా! నీ విలువ ఇంత అని చెప్పడానికి నాకు శక్యమా? అయినా నీ విలువకు సరిపడ ఒక గోవును ఇస్తాను' అని చెప్పాడు. చ్యవనుడు తృప్తిచెంది: 'అగ్ని మయమూ, అమృతమయమూ అయిన గోవు దేవతలకుకూడా పరమ పూజనీయమైనది' అని వచించాడు.

ఈ కథ గోబ్రాహ్మణుల సమానత్వాన్ని నిరూపిస్తున్నది.

తల్లి తరువాత తల్లివంటిది గోవు. మానవుణ్ని భరించేది భూమాత, మానవుణ్ని పెంచేది 'గోమాత'. తనను పెంచే తల్లి వంటిది కనకనే బిడ్డకు ఆవుని చూస్తే భక్తి. ఆవుని తల్లిగా ఎంచుకోవటంచేతనే ఆవుకు పుట్టిన తువ్వాయిని తమ్ముడిగా భావించి ముచ్చటపడుతూ వుంటుంది పాపాయి.

ఆహ్లాదకరమైన ఆవు, తువ్వాయిల సాహిత్యం తెలుగు భాషలో అపారంగా వుంది. పాపాయి ఇలా పాడతాడు:

'ఆవుకు ఉన్నది తువ్వాయి - అమ్మా అది నా తువ్వాయి
మెడలో మువ్వల తువ్వాయి - గబగబ ఉరుకును తువ్వాయి
నాతో వచ్చును తువ్వాయి - నాతో ఆడును తువ్వాయి'

బిడ్డకు తల్లి కరవయినా, తల్లిపాలు కరవయినా ఆ లోపాన్ని పూర్తిచేయగల సమర్థత ఒక్క గోవుకే వుంది. గోక్షీరాలలో అంత మహాత్యం ఉంది:

'పాలు తాగేనాడు — పరుగెత్తెనాడు
ఉగ్గు తాగేనాడు — ఊకొట్టెనాడు
అబ్బాయి నెవ్వారు — కొట్టిన్నవారు
కొట్టి గోవులపాలు — కొనిపోసినారు'

సుమిత్రుడనే ముని గోవులను మేపుతూ వుండేవాడు. అతడు, లేగలు పాలు త్రాగిన తరువాత పొదుగులను అంటు కొనివుండే నురుగును (ఫేనము) మాత్రం త్రాగి జీవించేవాడు. అందుచేతనే అతనికి 'ఫేనపుడు' అనే పేరు వచ్చింది. కపిల గోవుల మహిమవలన ఇతడు గోలోకానికి పోయిన వృత్తాంతమూ, రంతిదేవుడు ఆతని గోవులను యాగములో వేల్చి వాటిని గోలోకానికి పంపిన ఘట్టమూ భారతంలో ప్రసిద్ధి గన్నవి.

ఆవుకూడా మనిషిలాగే చాలా నాజూకయిన జంతువు. ఎనుబోతులాగ అది వర్షంలో ఉండలేదు.

చూడ ముచ్చటయిన జంతువులలో ఆవు ముఖ్యమైంది. ఆవుతువ్వాయిలు మనుషుల పాపాయిలతో కలిసి ఎంతో మచ్చికగా ఆడుకుంటాయి. అందుకనే మన బాలవాఙ్మయబ్రహ్మ శ్రీ చింతా దీక్షితులు :

'ఆవుగారమ్మాయి - అసలు మా తువ్వాయి'

అన్నాడు.

పవిత్రమైనటువంటి ఆవు యొక్క నామాంతరాలు కొన్ని : మాహా, మాహేయి, సౌరభేయి, గవి, శృంగిణి, అర్జుని, అఘ్న్న, ఉస్ర, మాత, రోహిణి, గోవు, మొదవు.

ఆవు గడ్డి వేసినప్పటికంటె గంగడోలు దువ్వినప్పుడు ఎంతో సంబరపడుతుంది.

ఒకప్పుడు కశ్యపుడు సముద్రుని హోమధేనువులను పుచ్చుకొని తిరుగా ఇవ్వలేదు. అందుచేత బ్రహ్మదేవుడు గోవు

లను అపహరించిన కశ్యపుని 'భూలోకంలో గోపుడవై పుట్టు' మని శపించాడు. ఆ శాపంచేతనే కశ్యపుడు వసుదేవుడుగా జన్మించాడు. వసుదేవుడు కంసుడి గోగణములకు అధిపతి. వసుదేవుని కొడుకే వాసుదేవుడు—అనగా శ్రీకృష్ణభగవానుడు.

జగన్నాటక సూత్రధారుడైన శ్రీకృష్ణభగవానుడికీ, దైవాంశ గల గోవుకీ పాయరాని సంబంధం వుంది. అందుకనే శ్రీకృష్ణుడు 'గోపాలు'డయ్యాడు. కృష్ణుడు నివసించేది యమునా నదిపై 'గోకులం'. అష్టమినాడు పుట్టిన కృష్ణుని జ్ఞాపకార్థం చేసే పండుగే 'గోకులాష్టమి.' గోవుల్ని మేపేవాడు 'గోపాలుడు'. పశువుల్ని మేపడంలో 'గోపాలుడు' పేరుపొందాడు. అందుకనే:

'గోరంత దీపమ్ము - కొండలకు వెలుగు
గోపాలకృష్ణమ్మ - గోవులకు వెలుగు'

అనే పాట పుట్టింది. 'గోవర్ధనుడు', 'గోపబాలుడు' అనికూడా 'గోపాలుడికి' పేర్లు. తన మురళి మ్రోయించి అమరగానముచే గోవులకు విందుచేసేవాడు 'గోవిందుడు.' కైలాసనాథుడైన శివుడు 'పశుపతి'.

మనుషులకే కాదు. పశువులకూ పొంగలిపండగ వున్నది. సంక్రాంతికి మరునాడు 'మాట్టు పొంగలి' అంటారు. ఆనాడు ఆవులనూ, తక్కిన పశుగణాన్నీ వైభవంగా అలంకరించి బొట్లు పెట్టి, నాటికి పిండివంటలు ఆరగింపు చేసి, ఊరేగిస్తారు. ఈ పశువులపండగ నేపాళదేశంలో ముమ్మరంగా జరుగుతుంది. ఇటు వంటి ఉత్సవాలతో 'గోపూజ' చేస్తారు. కాబట్టే నేపాళదేశీయులకు 'గోరక్షకులు'—ఘూర్కాలు—అనే పేరు అన్వర్థమై వెలిసింది.

ఆవు సంపూర్ణంగా ప్రయోజనకారి ఐ వున్నది. అందు కనే అది అతిపవిత్రంగా ఎంచబడుతూ వుంది. ఆవుపంచితం ఉబ్బురోగాలకు పెట్టిందిపేరు. గోమయం క్రిమిసంహారి. గుమ్మ పాల పస పిల్లలకు తెలుసు; మరి వస్తాదులకు తెలుసు. ఆవు నెయ్యి బాలింతలకు అవసరం. లక్షవత్తుల వ్రతానికికూడా ఆవు నేతినే ఉపయోగించాలి. వెన్న—చెప్పేదేమిటి? మన గోపాల కృష్ణుడు అసలు వెన్నదొంగ!!

ఆవునుండి వచ్చే ఐదుపదార్థాలను 'పంచగవ్యము' లంటారు. అవి : పాలు, పెరుగు, నెయ్యి, పంచితం, గోమయం.

తద్దినంనాడు పిండాలు ఆవుకి పెడితే పితురులు తరిస్తారని శాస్త్రం.

గోవు విలువ చెప్పాలంటే తక్కిన దాని శరీరభాగాల మాట అటుంచి ముఖ్యంగా 'గోరోజ'నాన్ని గురించి పేర్కొన వలసి ఉంటుంది. వైద్యరీత్యా దీని ప్రాముఖ్యం ఎంతో ఉంది.

సత్యకాలంలో ప్రభువులు—ప్రభువులేకాదు, కాస్తంత స్తోమతుగల రైతుజనం—'గోగ్రాసం' కోసం కొంత భూభాగం వదలిపెట్టేవాళ్లు. వీటికే 'గోభూము' లని పేరు.

కన్నడంలో 'గోకల్లు' అనే పదం ఉంది. పూర్వకాల మందు ఉదారులైన శ్రీమంతులు గోవులు మసిలే ప్రదేశాల యందు ఎత్తయిన రాళ్లు పాతించేవారు. పొలాల్లో మేసే ఆవులు ఆ రాళ్ల వద్దకు వచ్చి మెడలు వాటికి రాచి గోక్కునేవి.

ఆవు చెవిలాంటి మూతిగల పాత్రను 'గోకర్ణం' అంటారు. సంతర్పణాలలో గోకర్ణంతో ధప్పళం, మజ్జిగా వడ్డిన జరగటం ఎవరెరగనిది ?

'గోకర్ణం' అనేసరికి ఒక చిత్రమైన పురాణగాథ జ్ఞాపకానికి వస్తుంది:

రావణాసురుడు గొప్పమాతృభక్తుడు. ఒకప్పుడు అతని తల్లి 'నాయనా! నాకు పూజకు శివుడి ఆత్మలింగం కావాలి' అని కోరింది. రావణుడివంటి రాజసుని చేతికి శివుని ఆత్మలింగం దొరికినట్టయితే ప్రపంచానికి ప్రళయమే. అందుకని నారదుడు ముందుగా కైలాసానికి పోయి ఈశ్వరుణ్ణి హెచ్చరించాడు.

అనుకున్నప్రకారం రావణుడు శివునికోసం తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమయ్యాడు. అన్నట్టు, శివునివెంట పార్వతికూడా వచ్చింది. శివుడు రావణుణ్ణి వరం కోరుకోమనగా ఆత్మలింగంమాట మరచిపోయి 'నాకు పార్వతి కావా'లన్నాడు. ఇవ్వక తప్పిందికాదు శివుడు. రావణుని వెంటబడి వెళ్తున్న పార్వతి మధ్యదారిలో 'మహంకాళి'గా మారిపోయింది. రావణుడు హడలిపోయాడు. తెలివి తెచ్చుకొన్నాడు. పార్వతిని వదిలేసి మళ్ళీ గాఢంగా తపస్సు ప్రారంభించాడు. ఈసారి శివుడు ఆత్మలింగాన్ని అనుగ్రహించక తప్పిందికాదు. అయితే యిస్తూ, 'రావణా! ఇది ఎక్కడ నేలకు తగిలితే అక్కడ స్థాపితమైపోతుంది. జాగ్రత్త సుమా!' అని హెచ్చరించాడు.

రావణుడు ఉత్సాహంతో తిరిగి వస్తున్నాడు. సంధ్యవేళ అయింది. అర్ఘ్యం వదులుదామంటే చేతిలో లింగమున్నదాయె. 'ఎలాగ' అని జిజ్ఞాసపడుతూవుండగా ఒక పొట్టి బ్రాహ్మణబాలుడు ఆ దారిన వచ్చాడు. వాడి చేతికి ఆ లింగాన్నిచ్చి రావణుడు, 'అబ్బాయీ! కాస్త దీన్ని పట్టుకొనివుండు. సంధ్యవార్చుకొని ఇప్పుడే వస్తా'నన్నాడు. అందుకు ఆ బాలుని

రూపంలో వున్న విఘ్నేశ్వరుడు అంగీకరిస్తూ 'అయ్యా! నేను మూడుసార్లు పిలుస్తాను. మూడో పిలుపునకు మీరు రాకపోతే నేను దీన్ని కింద పెట్టేసి వెళ్లిపోతా' నన్నాడు! 'దాని కేముంది, క్షణంలో వస్తా' నంటూ రావణుడు వెళ్లాడు. ఆ టక్కరి బాలుడు వ్యవధిలేకుండా మూడుసార్లు గబగబా పిలిచి ఆత్మ లింగం కిందపెట్టేసి అదృశ్యమైపోయాడు.

రావణుడు ఉరకలు వేసుకుంటూవచ్చి దాన్ని ఎత్త బోయాడు. ఆ లింగం ఆవుచెవుల ఆకారంతో అక్కడే స్థాపితం అయిపోయింది. ఇదే 'గోకర్ణ క్షేత్రం'గా వెలిసింది. ఈ క్షేత్రాన్నిగురించి 'గోకర్ణ పురాణం'లో వివరింపబడివుంది.

ఇంద్రజాలవిద్యలలో గజకర్ణ, గోకర్ణ విద్యలు రెండు వున్నాయి.

తిరుపతిక్షేత్రంలో 'గోగర్భం' అనేటటువంటిది వుంది. యాత్రికులందరూ దీన్ని తప్పక దర్శించాలి.

గోగర్భంలాగానే 'హిరణ్యగర్భం' అనేది వుంది. తిరు వాన్కూరులో ఇదొక చిత్రమైన మతాచారం. ఒక సువర్ణ ధేనువును తయారుచేయించి, ప్రభువు దానిలోనుంచి దూరి బయటికి రావటం సాంప్రదాయంగా వుండేది. ఆ ఆచారం క్రమంగా మారి, ఆవుకు బదులు ఒక పెద్ద బంగారపు కల శలో దూరి ఇవతలకు రావటం జరుగుతూ వచ్చిందని చెబు తారు. పైన చెప్పిన కలశలో 'పంచగవ్యము' లుంచి లాంఛనం తీరగానే కలశను తునకలుగా చేసి దానం చేస్తారు.

'గోస్తని'నది భీమవరం తణుకు తాలూకాలలో వుంది. ఆవు పొదుగునుండి ప్రవహిస్తోందన్న సంప్రదాయాన్ని అనుస

రించి దీనికి పేరు వచ్చింది. దీని ఘనత వాయుపురాణంలో చెప్పబడివుంది.

పశువులకు ప్రసిద్ధి చెందిన 'నెల్లూరు'కూ గోవు సంబంధం వున్నట్లు 'ఐదేళ్ల అభ్యుదయం' లోని ఈ కథ విశదీకరిస్తున్నది:

'నెల్లూరు పేరు గురించి ఒక కథ చెప్పుతారు. ఆవు ఒకటి రోజూ ఒక రాతిశివలింగం దగ్గరకువెళ్లి ఆ లింగాన్ని తన పాలతో అభిషేకించేదట. ఆ లింగం ఉన్న చెట్టుపేరు నెల్లి. ఆవుపాలు తగ్గిపోతున్నాయని ఆసామి, ముక్కంటిరెడ్డి గొడ్ల కాపరిని మందలించాడు. గొడ్లకాపరి శివలింగాన్ని ఆవుపాలతో అభిషేకం చేయటం చూసి, లింగాన్ని కత్తితో వేటువేశాడు. లింగంలోంచి నెత్తురు ప్రవహించింది. ఆరాత్రి ఆసామికి నిద్రలో ఎవరో కనపడి, లింగం ఉన్నచోట దేవాలయం కట్టించవలసిందిగా ఆదేశించారు. లింగం ఉన్న చెట్టు పేరునుంచి, 'నెల్లూరు' పేరు వచ్చిందంటారు.'

త్రిమూర్తులకు, దేవగణాలకూ ఒక్కొక్క లోకం నియమితమై ఉన్నట్టుగానే, ప్రత్యేకించి 'గోలోకం' అనేదికూడా ఒకటి వున్నది.

పరమపవిత్రమైన గోలోకాన్ని 'కాశీఖండము' ఇట్లా వర్ణిస్తూంది:

'ప్రవహించు నెచ్చోటఁ బరిపూర్ణ సంపదఁ
దొలుకాడుచు నపార దుగ్ధనదులు
నవరిల్లు నెచ్చోట జర డగ్గఱఁగనీక
సంతత యౌవన సౌష్ఠవంబు
లలరొందు నెచ్చోట నాజ్య నిర్ఝరులతో
బహుసంఖ్యఁ బాయస పర్వతములు

బెడఁగొందు నెచ్చోటఁ గడమ యెంతయులేమి
సామగ్రిశుభవస్తు సంచయంబు
నట్టి గోలోకమునయందు నధివసింతు
రభవుచేఁ బ్రొద్దు బ్రొద్దు నెయ్యంబుఁ గనుచు
నలఘు మూర్తులు గోమాతృకలు గుశీల
యాదిగాఁగల పరమకల్యాణనిధులు'

'గోచర్మము' అని ఒక పదం వుంది. అనగా—నూరు ఆవులు, వాటి లేగలు, ఒక ఆబోతు—ఇవి మసలడానికి సరిపడి నంత మేర. ఈ పరిమితి గల జాగా ఒకమనిషికి ఒక వత్సర గ్రాసాన్ని ఇస్తుందని అంచనా.

'గోమేథం' అనగా ఆవును ఉపయోగించి చేసే యజ్ఞం. యజ్ఞంకోసం గోవును పాశంతో బంధించి కడతారు. కనుకనే తమిళంలో దీనిని 'పశు' అన్నారు.

బ్రాహ్మణులు 'గోష్పద' మంత జుట్టు వుంచుకోవాలని పూర్వుల నియమం.

'గోహింస' అనగానే వళ్ళు జలదరిస్తుంది - ఇటువంటి పవిత్రమైన - ఉత్తమమైన - దైవాంశ గల గోవును హింసించ టానికి చేతులెలా వస్తాయా అని. 'గోహత్య'ను మించిన మహా పాతకం మరొకటిలేదని పెద్దలు వచించారు.

గోవును చంపేవాణ్ణి 'గోసంగి' అంటారు.

పూర్వకాలమందొకప్పుడు గొప్పకాటకం పట్టింది. ప్రజ మలమల మాడిపోతున్నారు. ప్రజతోపాటు తపశ్శాలులైన మహాఋషులు కూడ మాడిపోయారు. గౌతమఋషి మాత్రం బ్రహ్మవల్ల వరం పొంది పుష్కలంగా పంటలు పండించుకొని

సుఖంగా కాలక్షేపం చేస్తూవచ్చాడు. తను సుఖించటమే కాకుండా తనను ఆశ్రయించిన వాళ్లకుకూడా సాయపడుతూ వచ్చాడు. అందుచేత ప్రజలు గౌతముణ్ణి ఆశ్రయించి ఆహారం సంపాదించుకొనేవారు. గౌతమమహర్షి కీర్తి దశదిశల వ్యాపించింది.

ఇదంతా చూడగా తక్కిన ఋషిగణంలో అసూయ బయలుదేరింది. వాళ్లందరూ కూడి ఆలోచనచేసి, ఒక మాయ గోవును సృష్టించి గౌతముని పొలంలోకి తోలిపెట్టారు. అది చేను మేసిపోవటం కళ్ళబడి గౌతముడు నీళ్లు చల్లి దానిని బెదిరించాడు. వెంటనే మాయగోవు విలవిల తన్నుకు చచ్చింది.

అప్పుడు ఋషులందరూ గౌతముణ్ణి దుయ్యబట్టి "ఏమయ్యా! మహర్షినని పేరుపెట్టుకొని గోహత్య ఎలా చేశావు?" అని గేలిచేశారు. గౌతముడు హడలిపోయాడు. గోహత్యాపాతకం ఎలా పోతుందో చెప్పమని వారిని బ్రతిమిలాడాడు. అందుకు వారు, "గోవు కళేబరంమీద గంగాజలం ప్రవహించినట్లయితే ఈ పాతకం పోతుంది" అని చెప్పారు. గౌతముడు శివుణ్ని గూర్చి ఘోరతపస్సు చేయగా శివుడు ప్రత్యక్షమై గౌతముడికి తన జటల్లో ఒకటి తీసి యిచ్చాడు. దానిలో గంగను గౌతముడు గోకళేబరంమీద పిండేసరికి అది లేచి నిలబడింది. ఈ విధంగా శివుని జటనుండి ప్రవహించిన జలమే 'గోదావరి'నది అయింది. గౌతముడు తీసుకురాబట్టి గోదావరికి 'గౌతమి' అని పేరు వచ్చింది. ముఖ్యులైన సప్తమహర్షులు ఈ గోదావరినుండి తలకొక పాయా తీసుకొని పోయారు. ఒక్కొక్క పాయకు ఒక్కొక్క ఋషిపేరు వచ్చింది.

ఇప్పుడు గోదావరీ తీరమందున్న కొవ్వూరు పూర్వం 'గోవూ'రట. గౌతముడు మాయగోవును చంపటం, తరువాత గంగను తీసుకువచ్చి గోవును బతికించటం ఈ ప్రదేశమందేనని ఒక గాథ.

ఇక్కడ గోవు డెక్కలు స్పష్టంగా కనబడుతూ వుంటాయి. అందుచేతనే ఇది 'గోపాద క్షేత్రం' అని పిలువ బడుతూవుంది.

ఆవులు—వెల్లావు, పుల్లావు, బట్టావు, పొట్టిఆవు, పొట్లావు, బోడిఆవు (కొమ్ములు లేనిది)—అంటూ అనేక పేర్లతో అనేక తరహాలుగా వుంటున్నాయి. అన్నింటిలోకి కర్రి ఆవు - అనగా 'కపిలగోవు' శ్రేష్ఠతను పురాణాలు ఎక్కువగా వర్ణించాయి. దీనినే :

'పెద్దోటి అబ్బాయికి ఎర్రావుపాలు
నా చిన్న అబ్బాయికి నల్లావుపాలు'

అంటూ తల్లులు జోలపాటలలో పాడతారు. 'కపిల గోవు' పాలల్లో విటమిన్ 'డి' నిండుగా ఉన్నదని రూఢి చేసుకున్న ఆధునిక శాస్త్రజ్ఞులు సైతం దీని ప్రాశస్త్యాన్ని అంగీక రించి తీరుతున్నారు.

శివుడు హిమాలయాలమీద తపస్సు చేసుకుంటూ ఉండేవాడు. ఆ ప్రదేశంలో గోవులు తమ లేగలతో స్వేచ్ఛగా విహరిస్తూ ఉండేవి. ఉండగా, ఒక లేగ నోటినుండి పాలనురుగు గాలికి ఎగిరివచ్చి శివునిమీద పడింది. శివుడు కోపంతో కన్ను తెరిచేసరికి గోవులన్నీ నల్లబడిపోయి, భయంతో పరుగుచ్చు కున్నాయి. అప్పుడు బ్రహ్మదేవుడు శివునికి నమస్కరించి :

'గోవులకు ఎంగిలిలేదు. దూడ కుడిచిన పిమ్మట పిదికిన పాలు మిక్కిలి పవిత్రవంతములు' అని చెప్పాడు. శివుడు తన దృష్టిచేత కపిలవర్ణం పొందిన ఆ గోవులు ఉత్తమమైనవీ మిక్కిలి పవిత్ర వంతమైనవీ అయ్యేటట్లు వరం అనుగ్రహించాడు. శివునకు 'గోపతి' అనే పేరు బ్రహ్మ ఇచ్చినదే.

గోవు ఆధిక్యతనుగురించి పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి గారు వ్రాసిన మహావాక్యాలు: "భారతీయులకు గోవు కంటె బవిత్రమగు వస్తువేదియు గానరాదు. వేదములు - యజ్ఞములు- పురాణములు - వ్రతములు - శుభకర్మములు - అశుభకర్మములు వ్యవసాయము - ఐశ్వర్యము - భోజ్యము - భోగము - ఇది యది యననేల, సమస్తము గోవుతో సంబంధించియే యుండును.

జీవించినంతకాలము గోవుచే దరించితి ననుకొనెడి యార్యమతస్థుడు, చచ్చిన పిమ్మటగూడ గోదానము చేసిననె కాని పరలోకమునందలి 'వైతరణీనది' యను నరకము దరింప లేనని తలంచుట, గోమహిమాతిశయమునకు నిదర్శనము గాదా! గోదాన విశేషముచే 'నృగ, ఇంద్రద్యుమ్నాదు' లతి శయ కీర్తినొందిరి. గోవిషయక వివాదములచే విశ్వామిత్రుడు శాంతి ప్రధానమగు ఋషిత్వ మొందుటయు బరశురాముడు శాంతిని వీడి యుగ్రత్వము నొందుటయు గలిగె.

వేదములలో గోపూజాసంబంధమగు పెక్కు సూక్త ములు గలవు. గోవు తల్లి, వృషభము తండ్రి - యని భారత మున గలదు. గోవును తన్నుట మహాదోషమని యథర్వ వేదమునను, శ్రీమద్రామాయణమునను చెప్పబడెను."

ఇంతగా మనం గొప్పచెప్పుకొనే ఆవు అబద్ధమాడిందనీ, అందుచేత పొద్దున్నే దాని ముఖం చూస్తే పాపమనీ ఒక పురాణగాధ ఉంది. ఈ గాథయందు నమ్మకం గల పెద్దలు ఈనాడుకూడా లేస్తూనే ఆవు పృష్ఠభాగమేగాని ముఖం చూడ టానికి ఇష్టపడరు.

స్వర్గంలో ఉండేది 'కామధేనువు.' కామధేనువు సమస్త మైన కోరికలనూ తీరుస్తుందని నమ్మిక. ఇది సముద్రమథన కాల మందు పుట్టింది. ఇది జమదగ్ని మహర్షి వద్ద ఉండగా కార్త వీర్యార్జునుడు దీనిపైన కన్నువేసి బలాత్కారంగా లాక్కుపో యాడు. అందుకోసమే పరశురాముడు క్షత్రియులమీద ఇరవై ఒక్కమారు దండెత్తడం జరిగింది.

పురాణ ప్రసిద్ధమైన 'కామధేనువు'నుగురించి భాగవతం:

'తెల్లనిమేనును నమృతము
జిల్లున జల్లించు పొదుఁగు సితశృంగములుం
జెల్లుగ నర్థుల కోర్కులు
వెల్లిగొలుపుమొదవు పాలవెల్లిం బుట్టెన్'

దీనిని గురించే 'లక్ష్మీనారాయణ పరిణయం' ఇలా చెప్తోంది:

'ఘుల్లు ఝుల్లునచేఁపి చాల పాల్గారెడు
బోడచన్నుల గొప్ప పొదుగుతోడ
వెలిజల్లెతునకరఁ గులుజూపు కొనకుచ్చు
తోరపౌ నిడువాలు తోఁకతోడ
కుడుచు డెక్కలబాగు గొరిసెల యందంబు
గల కుచువాటంపు కాళ్లతోడ
తెలిదామరల చాయ తెలివొందు కనుదోయి
సొగసుమించిన సోగమొగముతోడ

సోయగపు వంక కుఱుకొమ్ము దేయితేడ
వ్రేలుపలుచని నునుగంగడోలుతోడ
మెఱుఁగు బటువునుగల తెల్లమేనితోడ
కామధేనువు పుట్టె నా కడలియందు'

(సురభి) కామధేనువు బిడ్డపేరు నందిని. నందిని వశిష్ఠుని హోమ ధేనువు. దిలీపమహారాజు ఈ నందినీధేనువును సేవించి, దాని వలన సంతానం కలిగేటట్లు వరం పొందాడు.

భోజరాజీయంలో 'గోవ్యాఘ్ర సంవాదం' అనేఘట్టం కరుణారసపూరితమైంది. ఇది 'గోగీతం' అని ప్రసిద్ధి చెందింది.

'సత్యగోవు' అనే జాతీయం ఈ కథనుండి వచ్చినదే. ఎక్కువగా నమ్మదగిన వానిని గురించి ఈ జాతీయం ఉపయో గిస్తాము.

మహాభారతంలో ఉత్తరగోగ్రహణ ఘట్టం చాలా ముఖ్యమైనది. విరటరాజు కొలువులో బృహన్నలగా నెలకొని వున్న అర్జునుడు విరటుని ఆలమందలను కౌరవుల బారినుండి మళ్లించుకు వచ్చాడు. ఇది ఎంత సామర్థ్యమో చెప్పడానికి వీల్లేదు. దీన్ని బట్టే 'ఆవుల్ని మళ్లించినవాడు అర్జునుడు' అనే సామెత చిరస్థాయిగా నిలిచిపోయింది.

'ఆవు'కి సంబంధించిన సామెతలు చాలా వున్నాయి:

'ఆవులూ ఆవులూ పోట్లాడుకుని లేగల కాళ్లు విరిచినట్లు'

'ఆవుల సాధుత్వమూ, బ్రాహ్మణుల పేదరికమూ లేదు'

అదృష్టం చూసుకుని గర్వపడేవాళ్ళను 'ఆవుపాడి ఎంత ? ఐశ్వర్యమెంత?' అంటారు.

తల్లిదండ్రుల ఛాయనే బిడ్డలు నడుచుకుంటారని చెప్పటానికి 'ఆవు చేనిలో మేస్తే దూడ గట్టున మేస్తుందా?' అని ప్రశ్నిస్తారు. 'ఆవువెంట దగులు క్రోడెభంగి' అని పోతనామాత్యుని వచనం. దీనినే 'గోవత్సన్యాయ' మంటారు.

సంచికట్టు వైద్యులనుగురించి తమాషాకు :

'అటయితే వైద్యకట్నం; ఇటయితే వైతరణీ గోదానం'

అంటూ వుంటారు.

'ఎగదీస్తే బ్రహ్మహత్య; దిగదీస్తే గోహత్య'

అని ఒక నానుడి ఉన్నది. ముందుకుగాని వెనుకకుగాని వెళ్లలేని సందిగ్ధావస్థలో ఈ సామెతను ఉపయోగిస్తారు. దీన్నిగురించి చారిత్రక ప్రసిద్ధమైన ఒక గాథకూడా ఉంది.

'వెయ్యి ఆవులు కలవానికి ఒకటి తన్నుకొనిపోతేనేమి'
—అని ఒక సామెత. ఈ లోకోక్తినే పూర్వకవి ఒకడు చాటువుగా చెప్పాడు :

'పెక్కావు లిచ్చుచో నెక
బక్కా వీకుండెనేని పాడికిఁ గఅవా
పెక్కుద్దొర లిచ్చుచో నెక
కుక్కలకొడు కీయకున్నఁ గూటికిఁ గఅవా'

సంఘంలో పైకి సాధువులుగా నటించే దుష్టప్రవృత్తి గల వాళ్ళను 'గోముఖ వ్యాఘ్రము' లంటారు.

తమిళంలో ఒక సామెత వుంది :

'అసైన్దు తిన్గిరదు మాడు
అసైయామల్ తిన్గిరదు వీడు'

అని. అనగా: ఆవు తిరుగుతూ మేస్తుంది. ఇల్లు కదలకుండా వుండే మేసివేస్తుందని అర్థం.

దుష్టులైన పాలవాళ్ళు దురాశచేత లేగలకు పాలు వదలక అవి త్వరితగతిని కృశించి చచ్చేటట్టు చేస్తారు. పెయ్యకుని కెయ్యగానే దాని చర్మంలోపల గడ్డి కుక్కి 'చేతపెయ్య'ను తయారుచేసి, ఆవు కళ్ళముందు పెడతారు. ఆ స్వరూపం చూచుకొని తృప్తిపడి ఆవు చేపుతుందని వాళ్ళ ఆశ. దీనినే "చేపటానికి చేతపెయ్య చాలు"నని సామెతగా చెప్పుకొంటారు. ఈ సందర్భంలో మరికొన్ని సామెతలు:

'దూడలేని పాడి దుఃఖపు పాడి'
'దూడ కుడిస్తే గాని ఆవు చేపదు'
'లావు (ఎరువు) లేని చేను, లేగలేని ఆవు నిష్ప్రయోజనాలు'

ఇదే భావాన్ని భర్తృహరి తన 'సుభాషితము'లలో ఇలా వాకొంటున్నాడు;

'అడిగినయట్టి యాచకుల యాశ లెఱుంగక లోభవర్తియై
కడపిన ధర్మదేవత యొకానొక యప్పుడు నీదు వాని కె
య్యెడల సదెట్లు పాలు తన కిచ్చునె యెచ్చటనైన లేఁగలన్
గుడువఁగ నీనిచోఁ గెరలి గోవులు తన్నునుగాక భాస్కరా'

ఎక్కడైనా విద్వాంసుడు లేని చోటులో తెలివితక్కువ వద్దమ్మె పెద్దయి కూర్చుంటాడు. దీనినే 'ఏ గోవూ లేని వూళ్లో గొడ్డుగేదే శ్రీమహాలక్ష్మి' అంటారు.

"గొడ్డు"ను గురించి కొన్ని సామెతలు:

'తాపుల గొడ్డుకు రోలు అడ్డము'
'మంచిమనిషికి ఒకమాట; మంచిగొడ్డుకు ఒకదెబ్బ'

'మీ గొడ్డుకు యింత తవుడు అంటే
మీ బిడ్డకు యిన్ని పాలు అన్నాడట'
'పట్టిగొడ్డుకు అరుపులు మెండు ;
వరపుటేటికి మెరుపులు మెండు'
'గొడ్డు వచ్చినవేళ ; బిడ్డ వచ్చినవేళ'
'ఎక్కువ డబ్బుపెట్టి గుడ్డా—
తక్కువ డబ్బుపెట్టి గొడ్డునూ కొనకూడదు'

తిండిపోతురాముడయిన పనిదొంగను గురించి 'దున్నబోతే దూడలలోనూ, మేయబోతే ఆవులలోనూ' అని చెప్పటం కద్దు.

'ఆవు'ని గురించిన మరికొన్ని లోకోక్తులు :

'అయితంపూడి వుద్యోగం అయితే గియితే—
ఆరావుల పాడి చేస్తే గీస్తే — పెరుగూ పాలూ
మీవారికి పోస్తావా, మావారికి పోస్తావా ?'
'పాడిఆవును దానంచేసి పాలుమాత్రం పితుకుకొన్నట్లు'
'చెడిపోయిన బ్రాహ్మడికి చచ్చిపోయిన ఆవును దానం చేసినట్టు'

గోవు శరీరంలోని వివిధ భాగాలయందు వేర్వేరు దేవతలు అధిష్ఠించి వున్నారు. గోవు కాలిదువ్వాలలో లక్ష్మి వుంటుంది.

'మోచేతి పద్మమ్మ నోము' పాటలో సాయంకాలపు వర్ణన ఎంత చక్కగా సాగిందో చూడండి :

'ఆవులూ గొవులూ వచ్చేటివేళ
అంబోతు రంకెలూ వేసేటివేళ
సందింటి దీపమ్ము పెట్టేటివేళ
చాకింటి మడతల్లు తెచ్చేటివేళ'

పశుగణము ఇళ్లకు మళ్లే సమయాన్నే 'గోధూళివేళ' అంటాము.

'పాత్రాపాత్ర విచారస్తు ధేను పన్నగయో రివా'

అని సంస్కృత లోకోక్తి. అనగా—ఆవు గడ్డి తిని పాలిస్తుంది. పాము పాలు త్రాగి విషం కక్కుతుంది- అని అర్థం. పాత్రాపాత్ర విచారణ చేయక చేసే దానంగురించి వర్తించే లోకోక్తి యిది.

'గోదాన' ఫలాన్ని గురించి మహాభారతం :

'గోవులపా లమృతం బని
దేవేంద్రుడు సెప్పెఁగాన ధీరత్వనిధీ
గోవు నొసఁగ నమృతము స
ద్భావంబున నిచ్చినట్టి ఫల మొడఁగూడున్'

శేషధర్మము :—

'ఆవుదానంబుకన్న లే దధిక మొకటి
యపని న్యాయార్జితం బది యయ్యెనేని
యుభయకుల సంభవుల నెల్ల నుద్ధరించు
నమృత మరయంగ గోక్షీర మనియె బ్రహ్మ'

మంచి గోవులను దానంచేస్తే పుణ్యం ఎలాగో, బక్క గోవులను దానంచేస్తే అలానే పాపం చుట్టుకుంటుంది.

ఒకప్పుడు వాజశ్రవసుడు విశ్వజిద్యజ్ఞం చేస్తూ, తిండీ నీళ్లూ లేక అల్లాడే ఆవులను దానం చేయసాగాడు. 'అయ్యో! ఇటువంటి దానంవల్ల నా తండ్రి సౌఖ్యంలేని లోకాలకు పోతాడే' అని ఈ పనికి కొడుకు నచికేతుడు విచారించి, 'నాయనా! నన్నెవరికిస్తా?'వన్నాడు. పదేపదే అడిగేసరికి తండ్రి కోపగించి, 'నిన్నా? మృత్యువు కిస్తానురా!' అన్నాడు.

ఆ మాటప్రకారం నచికేతుడు మృత్యుమందిరం చేరుకున్నాడు. అక్కడ మూడు రాత్రులు ఉపవాసం చేసేసరికి,

ఇది అనర్థహేతువని భయపడి, మృత్యువు ఆయనను ఉపవాసం మాని మూడు వరాలు కోరుకోమన్నాడు. అలా కోరుకొని, మూడవ వరంవల్ల ఆత్మజ్ఞానం తెలుసుకొని తరించాడు నచికేతుడు.

గోదానం చేయడంలో ఇంద్రద్యుమ్నుడనే రాజు పేరు పొందాడు. తాను చేసిన పుణ్యంవల్ల ఆయన ఇంద్రలోకంలోకి వెళ్లాడు. తరువాత అతను సంపాదించుకొన్న కీర్తి మాసిపోవడంతోనే దేవతలు తిరుగ ఆయనను భూలోకానికి పొమ్మన్నారు. ఆ కాలమందు 'ఇంద్రద్యుమ్నం' అనే కొలనులో 'అకూపారుడు' అనే కూర్మరాజు నివసిస్తూ వుండేవాడు. అతడు ఇంద్రద్యుమ్నుని గుర్తించి: 'రాజా! నిన్ను నేను మరచిపోలేదు. నీవు నన్ను ఎన్నోసారులు కాపాడి వున్నావు. పెక్కు యజ్ఞములు చేసియున్నావు. నువ్వు దానమిచ్చిన గోవుల త్రొక్కిడి చేతనే కదా ఈ కొలను ఏర్పడినది!' అని చెప్పగా 'భూలోకంలో ఇంకా నీ కీర్తి నిలిచివున్నది రాజా!' అని దూతలు అతనిని మళ్లీ ఇంద్రలోకానికి కొనిపోయారు.

నృగమహారాజు కూడా లెక్కకు మిక్కిలిగా గోదానములు చేసి పుణ్యం సంపాదించుకున్నాడు. అయితే ఒకప్పుడు అతడు దానమిచ్చిన ఆవు ఒకటి తిరిగి మందలో కలిసి ఇంటికి వచ్చేసింది. ఈ సంగతి తెలియక రాజు ఆ గోవునే మరివక బ్రాహ్మడికి మళ్లీ దానం చేశాడు. మొదట దానంపట్టిన బ్రాహ్మడికీ రెండవ బ్రాహ్మడికీ తగువు వచ్చింది. ఇద్దరూ కలిసి నృగుని దగ్గరకు వెళ్లారు. నృగుడు తెలియక చేసిన పాపానికి

పరిహారంగా వేయిగోవుల నిస్తానన్నాడు. బ్రాహ్మణు లిద్దరూ ఒప్పుకోలేదు. ఆ గోవునే ఇమ్మని పట్టుపట్టారు.

నృగుడు ఈ అపరాధంవల్ల నరకానికి పోయాడు. తరువాత బ్రాహ్మణుల శాపంవల్ల ఊసరవెల్లిగా జన్మించాడు. తదుపరి శ్రీకృష్ణుని దర్శనంవల్ల నృగుడు శాపవిముక్తి పొందాడు.

భాగవతంనుండి ఒక కథ :

వేనరాజు దుష్టుడు. అతని దౌష్ట్యం ఎక్కువ కావటంచేత ప్రజలకు పీడాకరంగా తోచింది. అధర్మం పెరిగి, వర్షాలు లేక పంటలు పండలేదు. ఆహారంలేక, ఉపవాసాలుచేసి ప్రజ చచ్చిపోతున్నారు. అతని తదనంతరం కొడుకు పృథువు రాజ్యానికి వచ్చినప్పుడు దేశం మార్పు లేక, అలానే వుంది.

పృథురాజుకి భూదేవిపైన కోపంవచ్చింది. తన విల్లు ఎక్కుపెట్టి భూమిని కొట్టబోయేసరికి, గోరూపంతోవున్న భూదేవి ఎదుటికి వచ్చి నిలబడింది.

నిలిచి, 'రాజా ! నిరపరాధురాలైన నన్నెందుకు కొట్టబోతావు ? రాజులా నిర్లక్ష్యం చేశారు. రైతులా దున్నరైరి. కాబట్టి పంటలు లేకపోయినై. ఇది నా తప్పా ? ఇప్పుడైతేనేం ఒకపని చేయి : ముచ్చటైన ఒక లేగను నావద్ద తెచ్చి విడు. పాలు పిండటానికి బలవంతులైనవాళ్ళనుకూడా సిద్ధంచెయ్యి' అన్నది. అలానేచేశాడు రాజు. ఆవు చేపింది. చాలా పాలిచ్చింది.

మనువును దూడగచేసి పృథువు భూమినుండి ఓషధులను పితికాడు. యక్షులు, సిద్ధులు ఒక్కొక్కళ్లు అనువైన

వారిని లేగగ చేసి తమకు కావలసిన పదార్థములను పితుకు కున్నారు.

ఆ గోమాత చెప్పిన మాటలలోని అర్థం ఇది: రాజు మంచివాడై ప్రజల కష్టసుఖాలను స్వయంగా విచారించవలె. అలా చేస్తే ప్రజలు తమ తమ విధులు సక్రమంగా నెరవేరుస్తారు. ఎవరి విధులు వారు నెరవేర్చుకుంటే పంటలు బాగా పండుతాయి. పంటలు పండగానే సరిగాదు. పండిన పంటలు జాగ్రత్తపరచటానికి తగిన బందోబస్తు చేయాలె. అప్పుడే రాజ్యం సుఖంగా, సుభిక్షంగా వుంటుంది.

రాజువద్దకు వచ్చిన ఆ గోవే భూమాత. పంటలకోసం మనం చేసే దోహదమే లేగ. పంటలే పాలు. ఆ బలవంతులే పంటకు రక్షకులు.

'గోవు—లేగ' ఉపమానాన్ని భర్తృహరి ఎంత చక్కగా ఉదహరించాడో, ప్రభువుల విషయంలో:

> 'ధరణిధేనువుఁ బిదుకంగఁ దలఁచితేని
> జనులఁ బోషింపు మధిప వత్సముల మాడ్కి
> జనులు పోషింపఁ బడుచుండ జగతి కల్ప
> లత తెఱంగున సకలఫలంబు లొసఁగు'

మన తెలుగునాట పశువైద్య నిపుణులని పేర్గాంచిన 'అభినవ సహదేవ' డాక్టర్ ఏజెళ్ల శ్రీరాములుచౌదరిగారు ఇలా వ్రాస్తున్నారు:

"భారతవర్షము ప్రపంచమునకు పాడియావు. భారత దేశమునకు యిష్టదేవత గోమాత. భారతీయులకున్న ధనము గోధనము. భారతీయులు గోపాలురు. కృష్ణభగవానుడు గోపా

లుడు. గీతామృతము గ్రోలు భారతీయులు గో సంరక్షణార్థము దీక్షవహించుట శుభావహము. పరమధర్మము. సహదేవుడు పశుపాలనా దీక్షాదక్షుడు. పశువైద్య చికిత్సా ప్రవీణుడు.

పూర్వము పశువులే మనకు భాగ్యము. పశువులే జీవనాధారము. పశువు లున్నవారు భాగ్యవంతులు. పశువులు లేనివారు దరిద్రులు. గోదానమే దానములలో గొప్ప దానము. పుణ్యకార్యములలో గొప్ప పుణ్యకార్యము. ఆకాలమందు 'గోహత్య ఘోర రాక్షసకృత్యము. కుంభీనరక హేతువు. గోపాలనమే గాయత్రీమంత్ర జపతుల్య'మని వేదములు కీర్తించెను. ఉపనిషత్తు లుద్బోధించెను. పురాణములు ప్రకటించినవి. ఋషులు పాలించిరి."

పొట్టు తిని చిట్టు తిని గడ్డిపోచలు తిని
బ్రతికియున్నంత కాలము పాల నిచ్చు
చచ్చి సరునకు పాదరక్షల నొసంగు
ఎంత ధన్యమో జంతువో ఎంచ పశువు!'

—చిలకమర్తి లక్ష్మనరసింహం

చిన్నబిడ్డలు కథలు చెప్పుకొని చిట్టచివర:
'చెప్పినవాళ్లకు పాడావు; విన్నవాళ్లకు చూడావు'
అని ఫలశ్రుతి చెప్పకోవటం పరిపాటేకద!

—



# సాహిత్యంలో 'ఎద్దు'

పాలనిచ్చే తల్లి ఆవు ఐతే, పంట నిచ్చే తండ్రి ఎద్దు. ఎద్దు దుక్కి దున్నకపోతే పంట ఎలా పండుతుంది ? అందుకనే మనవాళ్ళు ఎద్దును ఎక్కువగా ఆరాధిస్తున్నారు.

వృషభం భూగోళాన్ని మోస్తున్నట్టు ఒక సంప్రదాయం ఏర్పడివుంది.

ఆరాధించడమేకాదు — మానవులలో మగవాడు (అబ్బాయి) పుట్టాలని ఎలా ఉవ్విళ్లూరుతూ వుంటారో, అలానే పశువులలో కోడెలు వృద్ధిపొందాలని రైతుబిడ్డ తపిస్తూ వుంటాడు. రైతు వానితపఃఫలమే కోడెదూడ. కోడె ముదిరితే గిత్త; గిత్తపెద్దదయితే ఎద్దు.

ఎద్దుకు ఎన్ని పేర్లున్నాయో చూడండి :

'బలము మీరినా బసవని జూడు
అందము చిందే నందిని జూడు
వాసిగాంచినా వృషభము జూడు
ముద్దులు గులికే ఎద్దును జూడు'

—అన్నాడొక మధురకవి. ముందుగా ఎద్దునుగురించిన ప్రసక్తి కానిద్దాం !

'ఎద్దు'కి ఎన్నో నామాంతరా లున్నాయి. అందులో కొన్ని : ఉక్షము, బలీవర్దము, గోద, ఋషభము, వృషభము, వృషము, అనడ్వాహము (బండిని వహించేది); సౌరభము, సౌరభేయము, ఉస్ర, భద్ర.

'ఆంబోతు' పేర్లు: షండము, ఇట్చరము, గోపతి, గోవృషము.

ఎద్దుల రకాలు: దుక్కిటెద్దులు, గానుగెద్దులు, బండి ఎద్దులు మొదలైనవి.

ఎద్దులలో పుంగనూరు ఎడ్లు, ఒంగోలు ఎడ్లు, మైసూరు ఎడ్లు—చాలా ప్రసిద్ధమయినవిగా ఎంచబడుతున్నాయి.

ఎద్దుయొక్క ప్రాశస్త్యాన్ని గుర్తించే మన కాంగ్రెసు వారు రెండు దుక్కిటెద్దులూ, నాగలీ చిహ్నంగా పెట్టుకున్నారు.

మేలుజాతి ఎద్దులను పశుసంతతి వృద్ధిచేయటం కోసం స్వేచ్ఛగా వదిలేస్తారు. దీనినే తోటపెద్దు, లేక ఆంబోతు అంటారు. ఏ మానవుడికయినా స్వేచ్ఛావిహారం మితిమీరి నట్లయితే 'అచ్చోసిన ఆంబోతులా ఆలా తిరుగుతావేం ?' అని అడగటం కద్దు.

అచ్చోసి ఆంబోతును వదలటం మనదేశంలో ఒక ముఖ్యమైన మతసాంప్రదాయం. దీన్నే 'కామ్యవృషోత్సర్జన' అని చెప్తారు. దీనికే 'యథేచ్ఛం విహార వృషభరాజ' అని సంస్కృత న్యాయం ఒకటున్నది. అనగా 'బసవన్నా! నీ యిష్టము వచ్చి నట్లూ తిరుగు' అని అచ్చువేసి విడిచిన ఆంబోతును గురించి చెప్పటం.

ఏటా 'మకర సంక్రమణ' కాలంలో ఆబోతుల్ని అలంక రించి ఉత్సవం చేయటం మనదేశంలో అనాదిగా వస్తున్న గొప్ప ఆచారం.

మన అదృష్టంకొద్దీ లిన్‌లిత్ గో ప్రభువు రాజప్రతినిధిగా వచ్చి—దేశానికి వెన్నెముకలయిన పశువుల విషయంలో ప్రత్యేకమైన శ్రద్ధవహించాడు—అప్పట్లో. ఈ సంప్రదాయాన్ని అనుసరించినవే 'గోవాడ' పశుప్రదర్శనాలు.

మానవ జీవితానికీ, ఎద్దుకూ సంబంధం కల కొన్ని సామె తలు ఉదహరిస్తా :

ఆలోచన లేకుండా ఏదో వకపని చేయడమే ప్రధానంగా పెట్టుకొన్నవాణ్ణి 'గుడ్డెద్దు చేలోబడ్డట్టు ఉన్న'దంటారు.

ఒకరి గురించి రెండోవానికి సానుభూతి లేనిపక్షం మందు 'ఎద్దుపుండు కాకికి ముద్దా ?' అని ప్రశ్నిస్తారు.

ఇద్దరు తెలివితక్కువ వ్యక్తుల తొందరపాటు సంభాషణను వర్ణించటానికి 'ఎద్దు ఈనెనంటే కొట్టాన కట్టుమన్నట్టు' అంటారు.

ఒక్కొక్కప్పుడు నాగలికి ఒకపక్క ఎద్దునూ, ఒకపక్క దున్ననూ కడతారు. ఇది సమమైన 'ఉజ్జీ' కాకపోవడంచేత 'ఎద్దు ఏదాటికి లాగితే దున్న కోదాటికి లాగుతుంది.' దీన్నే 'ఎద్దు ఎండకు లాగ; ఎనుపోతు నీడకు లాగ' అని చెబుతారు.

స్వారస్యం గ్రహించలేని మనిషినిగురించి 'ఎద్దేమి ఎరుగురా అటుకుల చవి ?' అంటారు.

లోకంలో అందరినీ మెప్పించలేము. ఒకరిని సంతోషపెడితే మరొకరికి కోపంవచ్చే తీరుతుంది. దీనినే 'ఎక్కుమంటే ఎద్దుకుకోపం; దిగుమంటే కుంటివానికి కోపం' అనివాడుతారు.

ఎద్దు చాలా పాటుపడే జంతువు. 'ఎద్దులాగా పాటుపడే' వాళ్ళను చూసి యజమాని చాలా సంతోషపడతాడు.

యజమానీ, సేవకుల సంబంధాన్ని గురించి ఒక చిత్రమైన సామెత వుంది :

'ఏలేవాని ఎద్దు పోతేనేమి ?
కాచేవాని కన్ను పోతేనేమి ?'

—అనగా యజమాని ఎద్దుపోతే పాలేరుకేం బాధ ? పాలేరు కన్నుపోతే ఖామందుకు ఏం విచారం ?

యజమాని, సేవకుల సందర్భంలో సుమతిశతకకారుడు కూడా ఒక చక్కటి పద్యం ఇలా చెప్పాడు :

'అడిగిన జీతంబియ్యని,
మిడిమేలపు దొరనుగొల్చి మిడుగుటకంటెన్

వడిగల యెద్దుల గట్టుక,
మడిదున్నక బ్రతుకవచ్చు మహిలో సుమతీ'

జడ్డుగా ఉండేవాళ్ళను 'ఎద్దు మొద్దు స్వరూపం' అంటారు. దీనినే మరికొంచెం వివరించి సాపాటురాముళ్ళ విషయంలో 'ఎద్దులా తిని మొద్దులా పడివుంటా'రని చెపుతారు.

ఒకపని చెయ్యాదలచినప్పుడు, ఆ పనిని రెండోవారు ఎలాగా ఆమోదించరని తెలిసినప్పుడు 'ఎద్దు నడిగా గంతలు కట్టడం?' అనే సామెత వాడుతాం. ఇది గానుగఎద్దుకు సంబంధించిన నానుడి.

అతిమంచితనాన్ని దుర్వినియోగం చేసే సందర్భంలో 'మంగలాణ్ని చూసి ఎద్దు కుంటిందట' అని చెప్పడం వుంది.

'ఎద్దు దున్నగా పిఱుజు వొరెగించింది' అని మరోసామెత. ఎద్దు దున్ని ఎంతో కష్టపడగా 'పిఱుజు' అనే చిన్నకీటకం 'దానికి గాలి ఊది సేదదీర్చా'నని బడాయి కొట్టిందట. అది గాలిపూదనెంత? ఎద్దుకు గాలి తగలనెంత? ఎవళ్ళకయినా గోరంత సాయంచేసి కొండంతలుగా చేసి చెప్పేవాణ్ని గురించి ఈ సామెత ఉపయోగిస్తారు.

'నసీస్రోత బలీవర్దన్యాయం' అని సంస్కృతంలో వున్నది. 'ఎద్దుకు ముక్కుత్రాళ్ళు కట్టినట్టు' దుష్టుని నిరోధంలో ఉంచటమని దీని భావం.

'ఎద్దు'కి సంబంధించిన మరికొన్ని సామెతలు, జాతీయాలు:

'బోడెద్దుకి పోట్లు మప్పినట్టు'
'ఎద్దునమ్మినవాడు ఎల్లుండే వస్తాడు'
'చదువులేని మొద్దు; కదలలేని ఎద్దు'

'వెల్లటూరిలో యెద్దునూ పరచూరులో పడుచునూ యివ్వకూడదు'
(లోకోక్తి - మాండలికం)

'ఎద్దులు బెదిరినా గానుగ బెదరదు'
'ఎద్దు మోసినంత; గోనె పట్టినంత'
'అత్తవారి ఇంట అల్లుణ్ణి చూడాలి;
అముదాల చేలో అబోతును చూడాలి'
'తుళ్లే యెద్దే గోనె మోసేది'
'దుక్కిటెద్దు దేశాంతరం వెళ్లినట్టు'
'పత్తిగింజలు తింటావా బసవన్నా అంటే అహా అన్నాడట;
గంతకట్టనా బసవన్నా అంటే ఊహూ అన్నాడట'

'గుండుగొమ్ముల అనుమానం' అనే వినోదసామ్యం ఒకటున్నది. అదీ ఎద్దుకు సంబంధించినదే. ఈ సామ్యాన్ని గురించి శ్రీ గొబ్బూరి రాఘవరావుగారు చెప్పిన అంతరార్థం ఇది:

"ఒక వూళ్ళో ఒక తెలకలివాడు. వాడి గానుగ ఎద్దుకి కొమ్ములు గుండ్రంగా ఉండేవి. గానుగపని తీరగానే ఆ ఎద్దు పడుకొని మేసినగడ్డి నెమరు వేసుకుంటూ తల అటూ ఇటూ తిప్పుతూ ఉండేది.

ఎదుటింట్లో ఉండే తంబళ్ల వీరయ్య అనే శివార్చకుడికి ఈ యెద్దూ, దానితల తిప్పటం చూసి కళ్లు కుడుతూవుండేవి. అంతేకాదు ఒక సందేహంకూడా పట్టి పీడిస్తూ వచ్చింది. ఆ ఎద్దుకున్న గుండ్రటి కొమ్ములమధ్య తన శరీరం సరిగ్గా పట్టుతుందా లేదా? అని.

ఇంతలో కనుంపండగ వచ్చింది. తెలుకలి తన ఎద్దుకి పసుపు రాసి, కుంకంపెట్టి ఆవేళకి సెలవు యిచ్చేశాడు. దాంతో ఎద్దుకు ఉత్సాహం మరీ పట్టపగ్గాలు లేకుండా పోయింది. తంబళ

వీరయ్య ఎద్దు శివిచూసి మరీ ఓర్వలేకపోయాడు. పైగా తన సందేహనివృత్తి చేసుకోడానికి కూడా ఇదే సమయమని వీరయ్య అమాంతంగా వచ్చి పడ్డాడు. అప్పుడు ఎద్దు తోసిన తోపుడుకి వీరయ్య దాని రెండు కొమ్ములమధ్య టకీమని ఇరుక్కు-పోయాడు. ఎద్దు గింజులాడింది. వీరయ్యకి ప్రాణసంకటమైంది.

వీరయ్య వేసిన కేకలకి నలుగురూ పోగయ్యారు. ఎద్దుకి వెర్రెత్తినట్టయింది. వీరయ్య దాని కొమ్ములమధ్య బిగుసుకు పోయి బెక్కుతూ వుండటంచూసి నలుగురూ కలిసి నాగా బత్తుణ్ని రప్పించారు. పదిమందీ కలిసి ఎద్దును పట్టుకోగా, బత్తుడు రంపంతో ఎద్దుకొమ్ములలో ఒకటి నేర్పుగా కోసేశాడు.

అప్పుడు వీరయ్య గభీమని కిందికి ఉరికి, 'నా అనుమానమూ తీరింది; పండగపూటా ఎద్దుకి శృంగభంగమూ అయింది' అని సంతోషం వెలిబుచ్చాడు.

ఇదే 'తంబళ్ల అనుమానం' 'శృంగభంగం', 'గుండు గొమ్ముల అనుమానం' అనే పేర్లతో తెనుగునాట వ్యాప్తిలో ఉంటున్నది.

గోవులలో గంగగోవులాగే ఎద్దులలో గంగిరెద్దు అనేది ఒకటుంది. గంగిరెద్దులవాళ్ళు డోలుకట్టి, సన్నాయి వూదుతూ ఇంటింటికీ రావటం ఎవరెరగరు?

గంగిరెద్దుచేత సలాంపెట్టించి, ఎంత ముచ్చటయిన సత్య వాక్కులను చెప్పించాడో చూడండి, మన 'బాపిబావ':—

"ప్రభువుగారికి దణ్ణంపెట్టూ
పాదం వచ్చి భక్తికి పెట్టూ,
పట్టుశాలువలు కప్పెదరంటా

కాసులు మువ్వలు కట్టెదరంటా
డూ-డూ-డూ-డూ యెంకన్నా !

మోసము చేసును మునసబుగారు
కక్షల కట్టును కరణంగారు
కలిమి కలిగినా కాపులు వీరు
డూ-డూ-డూ-డూ యెంకన్నా !

కుంచెడుమాయ కోమటిమాట
పత్తికాయరా భేమ్మణఘాటి
సలాము తెచ్చే సాయబు భేటీ
డూ-డూ-డూ-డూ యెంకన్నా !

చెట్టు కదిలినా పుట్ట పొదలదూ
నీరు పోయినా నాచు కదలదూ
గుడి పాడయినా గూబ వదలదూ
గుడిపాలాల పూజారి వదలడూ
డూ-డూ-డూ-డూ యెంకన్నా !

యేడుకొండలా యీశ్వరుడండీ
యెండికొండలా యెంకన్నండీ
భమిడి కొమ్ములా బసవయ్యండీ
డూ-డూ-డూ-డూ యెంకన్నా !"

స్వతంత్రమైన ఆలోచన అనేది లేకుండా పైవాళ్లు చెప్పే ప్రతి దానికి అంగీకారం తెలిపేవాణ్ని 'ఏమిట్రా, అయినదానికి కాని దానికి గంగిరెద్దులాగా తలూపుతావు ?' అని వ్యధికరిస్తారు.

'బసవ'ని గురించి ఒకానొక పూర్వకవి ఇలా అంటు న్నాడు :

'బండి నీడ్చుచు దిరిగెడి పనియు లేదు
అలయ మోయుటలేదు, సేద్యమును లేదు

దేవళపు దిండి బసవడు తృప్తి దినుచు
నిద్ర జెందెడి గంటిరే నీటుగాగ !'

చిన్న పిల్లలు ఉత్సాహంతో ఎలా పాడుతున్నారో చూశారా :

'హూగూ హూగూ బసవన్న
ఉలవలు తినరా బసవన్న
ఆడూ పాడూ బసవన్న
అన్నం తినరా బసవన్న
అంకాలమ్మ గుడికాడా
గంతులు వెయరా బసవన్న !'

వృషభం అనగానే పన్నెండు రాసులలో ఒకటయిన 'వృషభ రాశి' ఠక్కీమని జ్ఞాపకానికి వస్తుంది.

'వృషభం తన నాలుగు పాదాలతోను అలక్ష్మిని తొక్కి-వేసి భూమిని భేదించి కృషీవలుని కష్టాన్ని పోగొట్టుతూ వున్న'దని 'వృషభసూక్తం' చెబుతోంది.

కైలాసపతి అయిన శివుడు వృషభవాహనుడు, వృషధ్వజుడు కూడా.

ఈ సందర్భంలో మన దృష్టి పురాణకాలానికి కూడా సారించాలి:

మహాభారతంలో 'మానుపాద'మనే వృషభాన్ని గురించిన ప్రశంస వుంది. దీని చర్మంతో భేరీలు చేయించి జరాసంధుడు చైత్రకగిరిశిఖరాలలో పెట్టించాడు. పరు లెవరయినా నగరులో అడుగుపెట్టినప్పుడు భేరీలు తమంతట మ్రోగేవిట !

పోతన మహాకవి :

'పొగరెక్కిన మూఁపురములు
దెగగలవాలములు శైలదేహంబులు భూ
గగనములు నిండు అంకెలు
మిగుల మెఱయు వృషభగణము మెల్లన నడచెన్'

——అని వర్ణిస్తున్నాడు.

కంసుడు పంపిన రాక్షసగణంలో ఒకడు వృషభాసురుడు. వీణ్ణి శ్రీకృష్ణభగవానుడు చీల్చి చెండాడి లోకానికి వాడి పీడవదిల్చాడు.

శ్రీకృష్ణుడు సంచారంచేస్తూవుండగా అనేకమంది రాజులు వాళ్ళవాళ్ళ కుమార్తెలను ఇచ్చి పెళ్లిచేస్తూవచ్చారు. అందులో కోసలమహారాజు అయిన నగ్నజిత్తు ఒక చిత్రమైన పోటీ పెట్టాడు. భయంకరమైన ఏడు వృషభాలను వదలి వాటిని లొంగదీయగలవాడికి తన కూతురు నిస్తానన్నాడు. చాలామంది వచ్చి వాటిని చూడటంతోనే హడలిపోయారు. శ్రీకృష్ణుడు ఒక్కడే ఆ వృషభాలకు అనేక రూపాలలో ప్రత్యక్షమై ఒకొ్కక్కదాన్ని ముకుదాళ్ళు వేసి బంధించాడు. ఈ విధంగా నగ్నజిత్తు కూతురు కృష్ణునికి భార్య అయింది.

గ్రీకు పురాణకథల్లో 'బంగారు ఉన్ని' Golden Fleece కోసం బయలుదేరిన 'జేసన్' Jason అనే వీరుడిని 'కోల్చిస్' రాజు రెండు అసాధ్యమైన పనులు చెయ్యమని నియమిస్తాడు. అందులో ఒకటి - ముకురంధ్రాల నుండి అగ్నిజ్వాల లెగసివచ్చే రెండు వృషభాలను జయించుకురావటం. ఇది సుప్రసిద్ధమయిన అద్భుత కథ.

గ్రీకు పురాణాలనుండి మరొక ఘట్టం 'థీసియసు' ఎద్దు తల రాక్షసుడితో పోరాడిన ఉదంతం.

స్పెయిన్ దేశంలో Bull Fighting అనే వినోదం జరుగుతూ వుంటుంది. ఇది చాలా క్రూరంగానూ, భయంకరంగానూ ఉంటుంది.

ఇదికాక Bull-Baiting అనే మరొక క్రీడ వుంది. వృషభంమీద కుక్కలను ఉసికొలిపి అగచాట్లు పెట్టే ఆట ఇది. ఈ క్రీడ జరిగే ప్రదేశాన్ని Bull-Ring అని అంటారు.

ఇప్పటికి ఎద్దు, వృషభం, బసవన్న అనే పదాలకు సంబంధించిన సారస్వత విశేషాలు తడవినాము. ఇక, 'నంది'ని గురించిన చిత్రాలు—

'కైలాసంలో కాపురముండే
కాలకంఠునీ కావలి నందీ'

అని కవికుమారుడు పాడడాన్ని బట్టి, ఈశ్వరుడి సమక్షాన వుండే ఎద్దుకి 'నంది' అనే నామధేయం ఏర్పడిందని చెప్పకనే తెలుస్తున్నది.

నంది ఈశ్వరుడి వాహనం. శివకేశవ భేదాన్ని వాహనాలపరంగా నిరూపించే ఒక చిత్రమైన సామెత :

"ఎద్దునెక్కినవాడే లింగడు;
బొల్లిగద్ద నెక్కినవాడే రంగడు."

మన దేశంలో గొప్ప నందివిగ్రహాలు మైసూరు సంస్థానం చాముండీలో, తంజావూరులో, 'దక్షిణ కాశీ' అనబడే పీఠికాపురములోనూ ఉన్నాయి.

'నంది' అంటే సౌఖ్యమైనది అని అర్థం. దీనినే 'శాలం కాయన' మంటారు.

'తాండవ తాళికన్'—అనగా పరమశివుడు తాండవ నృత్యం చేస్తూవుంటే, ఆ నృత్యానికి లయ సరిపడేటట్లు అడుగులు వేయటం—ఆ ప్రజ్ఞ నంది ఒక్కదానికే వుందట!

ఈశ్వరుడి వాహనమైన ఈనంది మల్లెపువ్వులకంటె ధవళంగా వుంటుంది. ఇంచుమించు మంచులా వుంటుందంటే సరి. ఈశ్వరాలయాల్లో నందివిగ్రహం ఎల్లప్పుడూ యజమానికి ఎదురుగా పండుకొనివుంటుంది. ఏ క్షణాన ఈశ్వరుడు వచ్చి తనమీద అధిష్ఠిస్తాడా అనే అప్రమత్తతతో సిద్ధంగా వుంటుందన్నమాట.

'నంది'ని గురించి పోతన:—

'ఖురపుటాహతి రేఁగు ధరణీ పరాగంబు
పంకేరుహాప్త బింబంబుఁ బొదువ
విపులవాలాటోప విక్షేపజాత వా
తాహతి వారిదాహములు విరియఁ
గుఱుచతిన్నని వాఁడికొమ్ములఁ జిమ్మిన
బ్రహ్మాండభాండ కర్పరము వగుల
నలపోకవలె ఖణిల్లని ఱంకె వైచిన
రోదసీకుహరంబు బెదిలంగ

గళచలద్ఘర్మ ఘంటికా ఘణఘణ ప్ర
ఘోషమున దిక్తటంబు లాకులత నొంద
లీల నడతెంచు కలధౌత శైలమనఁగ
నుక్కుమిగిలిన వృషభేంద్రు నెక్కి వెడలె'

'అజ్జరపు పేరయకవి తన 'ఒడయనంబి విలాసము'లో :—

'కుఱుచలై మెలవంక గుబ్బికొమ్ముల రెంటి
తుదలయందును పైఁడి తొడవు లమర
అంకెవేసిన నూగి యోంకారములు వల్కు
గంటలపేరుల గళము మెఱయఁ
బటురత్నమయమైన బంగారు పల్లంబు
పైని బెబ్బులితోలు భాసిలంగఁ
ఫాలలోచనునాజ్ఞఁ బరువడి చనుదేర
నందియల్ ఘల్లు ఘల్లనుచు మ్రోయ
నాత్మపురదీప్తులను రాజహారహీర
కలశపాథోధిరాణ్మల్లికలను గెలువ
నుబ్బుచును వచ్చి శివుమ్రోల నొనర నిల్చె
రూఢి మెఱయఁగ ధర్మస్వరూపుఁ డపుడు'

"బృందావన విహారము'—నందిని ఇలా వర్ణిస్తూంది :—

'ముగురు వేల్పులకాదిమూలమై చెన్నొందు
పరశివతత్త్వ సామ్రాజ్య మనఁగఁ
త్రిభువన సంచారదీప్తమై వెలుఁగొందు
చంద్రమండల సుధాసారమనఁగఁ
వటపత్రశాయియై నటియించు శ్రీవిష్ణు
రమణీయక్షీర వారాశి యనఁగఁ
సాంబశివుండు నుత్సాహంబుతో నున్న
గొప్పైన కైలాస కుధర మనఁగ
ధవళకళకళకళదశదిశ దళితముగను
మంజుముక్త నికుంజముల్ రంజితముగ
ఘనఘనాక్రాంత మూపురాగ్రంబు గదురఁ
గేరుచును వచ్చె నా నందికేశ్వరుండు'

'మోముపట్టాంచితముక్త ఝల్లరులతో
నసియాడ శృంగముల్ విసరుచుండు
విసరుకొన్నంతలో వీఁక నొండొంటితోఁ
దాఁకి ఘంటాధ్వాన తతులు చెలఁగు
చెలఁగి అంకెలువేయఁ గలఁగి సింహంబులు
పర్వత గుహలకు బాఱఁజూచుఁ
బాఱఁజూచి త్రిలోక భయదంబుగాఁ దోఁచు
దోఁచి నృత్యముసేయఁ దొఱఁగుచుండుఁ
దొఱఁగి యా సాంబమూర్తిని దువ్వఁ బిలుచుఁ
బిలిచిరేమో యటంచును బెదరి మఱలు
మఱలి దనయంగముల తీట మాన్ప నెమరు
నెమరు వేయుచు బసవన్న నిండుసభను'

తేజఃపుంజమైనటువంటి శివుని దర్శనానికి ముందు మనం నందియొక్క చెవుల సందునించి చూడటం సాంప్రదాయంగా వుంది. ఏమంటే బ్రహ్మాండమైన ఈశ్వర శక్తికి నంది చిహ్నం. భక్తులకు నంది ముందుగా కనబడటంకోసమే ఈశ్వరాలయంలో నందివిగ్రహం ఈశ్వరుని విగ్రహానికి ఎదుట నెలకొల్పబడి వుంటున్నది.

నందికి అవతారా లెత్తే శక్తి వుండేది. ఒకప్పుడు నంది ఈశ్వరుని రూపం పొందగా ఆ మాయఈశ్వరుని చూసి పార్వతి సిగ్గుపడిందట. అప్పుడు శివుడు ఇది తెలుసుకొని నందిని "నీవు భూలోకానికి పోయి తపస్సు చేసి పాపవిముక్తి అయిన తరువాత మళ్లీ కైలాసానికి రావలసింది' అని ఆజ్ఞాపించాడు. అప్పుడు నందీశ్వరుడు మైసూరుసంస్థానంలోని ఇప్పటి 'నంది దుర్గం' అనే ప్రదేశమందు తపస్సు చేశాడట.

మరిఒక అవతారంలో నంది 'బసవ'ని రూపంలో భూమిపైన అవతరించాడు. ముఖ్యంగా మైసూరు ప్రాంతములో బసవేశ్వరుని పేర్లు చాలామంది పెట్టుకోవటానికి ఇదేకారణం. లింగధారులకు బసవారాధన ముఖ్యం. ఈ ఆరాధన మైసూరు ప్రాంతములో ఎక్కువ. బసవన్న పేరుతో ఒక పెద్ద పురాణమే సృష్టింపబడివుంది. అదే లింగాయతుల 'బసవపురాణం.'

నంది పేరుతో వెలసిన స్థలాలు మరికొన్ని ఇవి : 'నంద్యాల' - నంది ఆలయము కలది. నంద్యాలదగ్గర నల్లమల కొండలలో అడవిమధ్య ఉన్నది 'మహానంది.'

మైసూరు రాష్ట్రంలో 'బసవన్‌గుడి' ఉంది.

కృష్ణా జిల్లాలోని 'నందిగామ' అసలు 'నందిగ్రామమే.'

అందరకూ సంతోషాన్ని కోరే 'నందికేశ్వరుడి నోము'ను గురించి కావాలన్నా మరచిపోలేము.

నంది విషయంలోకూడా మానవునికి సంబంధించిన లోకోక్తులు కొన్ని వున్నాయి :

తలలు మార్చగల శక్తి కలవాడిని 'వాడు నందిని పంది, పందిని నందీ చేయగలవాడు' అని అంటారు.

ఒకడు ఏమి అంటే అదే చెలామణి అయే సందర్భంలో 'వాడు నంది అంటే నంది—పంది అంటే పంది' అని చెబుతారు.

శ్రీనాథుని 'పల్నాటి వీరచరిత్ర'లో 'ఎద్దు'లను గురించి ముచ్చటగొలిపే కొన్ని ముద్దుపేర్లు :—

"............................................
పేరుపేరున వానిఁ బిలిచిరీ రీతి
నందెల బసువన్న యాదినాథుండ
నందులపిడి ఘంట నాగవానయ్యా
గోవుల విటకాఁడ గోఁగుబయ్యన్న
వంటరిపలిజంకు వరపెరుమాళ్లు
కట్టని కలుకోట కరినంది అంకె
అకలంకగాత్రుండ అంబుధిశయన
బిరుదు గరుత్మంత భీముని గజము
గోవర్ధనాచల గోపాలదేవ
కరినందిబసువన్న కంచివరదుఁడ
నెలబాలచంద్రుండ నీలవర్ణుండ
జల్లుల దర్దజ జయకంఠనాద
వైకుంఠవాసుఁడ వాసుదేవయ్యా
పుట్టలభూపతి పుంజెల్లు పెద్ద
ఇంద్రుని వజ్రమ యిప్పగిరీశ
గోఁగుభైరవమూర్తి గోవిందరాజ
చెంచులయోబయ్యా చెన్నమల్లయ్యా
కంచియేకాంబర కాళికానాథ
మధురాపురిప్రియా మానందినాథ
రాముఁడా సోముఁడా అంకెలు నలుపు
మిటువలెఁ బిలిచిన నేపుమీఱంగ
వచ్చిన యెద్దుల వరుసతోఁ జూచి
వన్నెలు చిన్నెలు వడిఁ జెప్పికొనుచు
నెత్తురు కొమ్ముల నేటైనవాని
గఱుపు తోఁకలుగల కరిబొల్లివాని
నచ్చుగాఁ గరివన్నె లమరినవాని
మూఁపురంబులతోడ మెఱసినవాని

నుదుటఁ జుక్కలుగల నునుపైన వానిఁ
దెల్లనివన్నెలఁ దెలివైనవానిఁ
బచ్చని వన్నెలఁ బ్రబలినవాని
నిటువంటి యెద్దుల నెంతయునేర్చి
గంటలు గజ్జలు గణగణ మ్రోయ
గ్రక్కున యెద్దుల గాండ్లఁ గట్టించి
మోఁకుల బంధించి ముందుగానపుడు
..............................."

ఆదికాలంలో మానవుడు పశుగణంలోకల్లా మిన్న అని ఎంచి ఈ వృషభాన్నే ఆరాధిస్తూ వచ్చినట్లు అగుపిస్తుంది.

తదుపరి, మనుధర్మకాలంనాడు కూడా న్యాయానికి చిహ్నంగా వృషభాన్నే నిర్ణయించుకోవటం జరిగింది.

నిజానికి, ఆవు పవిత్రమయినదే అన్ని విధాలా. అయినా, పూజ విషయంలో వృషభానికి గల ప్రాముఖ్యం ఆవుకి లేదు.

దేశానికి ఎద్దూ, గుర్రం గొప్ప సహాయకారులు కావటముచేత వాటిని నాణెములమీద కూడా ముద్రించి గౌరవించారు—ప్రభువులు. పంటనిచ్చేది ఎద్దు; చతురంగబలాల్లో ముఖ్యమైనది అశ్వం. పంటలు బాగాపండి శత్రుభయం లేకుఁడ దేశం సంరక్షింపబడుతూవుంటే ప్రజల కంతా సౌఖ్యమే. ఈ కారణంచేతనే ఈ రెండు జంతువులకూ ఇంత గౌరవం ఏర్పడింది. వివిధ దేశాలలో పెక్కుమంది ప్రభువులు తమ తమ నాణెములమీద గుర్రాన్నీ, ఎద్దునూ ముద్రించి గౌరవించటం రెండువేల సంవత్సరాలకు పూర్వంనుంచీ జరుగుతున్నది.

1192 లో పృథ్వీరాజు పాలనలో నాణాల కొక పక్క ఆశ్వికుడు, రెండోవైపున వృషభము బొమ్మలూ సంస్కృత లిపితో ముద్రింపబడి వున్నవి.

పంజాబు, పాంచాలం, మధ్యప్రదేశ్, రాజపుత్ర స్థానాలను ఏలిన ప్రభువులందరూ ఎద్దూ, గుర్రం నాణెములనే వ్యాప్తిలో పెట్టినట్లు ఎన్నో నిదర్శనాలు ఇప్పటికీ కాన వస్తున్నాయి.

భారతదేశాన్ని ఏలిన ముస్లిం ప్రభువులు కూడా భార తీయులకు ఈ జంతువులయందు గల పవిత్రభావాన్ని కనిపెట్టి పై విధానమునే అనుసరించినట్లు అనేక తార్కాణాలు కనిపి స్తున్నాయి.

ఎప్పటిమాటో ఎందుకూ? ఈనాడు మనం వాడే అణా కాసులమీద బొమ్మ చూడండి!





# సాహిత్యంలో 'మేక'

మానవుడికి పసితనంలోనే మేకతో పరిచయం కలిగింది. చిన్న బిడ్డలను మనవాళ్లు :

'నూక లిస్తా - మేకల్ని కాస్తావ్ ?
పెద్దవులొస్తే - జడుసుకోవుకదా ?'

అని అడిగి కళ్ళలో వూది జడిపిస్తారు.

'ఆకలి యుడుగని కుడుపును
ప్రేకటి యగు లంజ పడుపు విడువని బ్రదుకుం
బ్రాకొన్న నూతి యుదకము
మేకల పాడియును రోత మేదిని సుమతీ!'

అంటూ ఈవిధంగా సుమతీశతకకారుడు ఎందుచేతనోగాని మేకపాడిని నిరసించి గర్హించాడు. ఇదే మనం ప్రామాణ్యంగా తీసికొన్నట్టయితే మేకకు నిజంగా పుట్టగతులే లేవు.

అయితే—

మన పూర్వులు మేకపాడి శ్రేష్ఠతను గురించి ఎంతగానో చెప్పివున్నారు. పూర్వులు చెప్పిన మాటలు తరుచు చెవికెక్కనట్టే ఈ విషయం కూడా ఈనాటివారికి అలక్ష్యంగానే తోచినట్టు తలపవచ్చు.

కాని—

మన గాంధిమహాత్ముడు మేకపాలు త్రాగటంతో దీనికి విలువ హెచ్చింది. బాపూజీ రౌండ్‌టేబిల్ కాన్ఫరెన్స్‌కి వెళ్లేటప్పుడు తనతో కూడా కొన్ని మేకల్ని తీసికొని వెళ్లటంతో, ఈవిషయానికి ప్రాముఖ్యం మరింత ఎక్కువయింది.

మేకలలో రకాలు: అంగోరా, కాశ్మీర్, కంచిమేక, బట్టమేక, చారమేక మొదలైనవి.

'గడ్డాలమేక'నే 'చింబోతు' అంటారు.

మేకల్లోకల్లా 'కంచిమేక' ప్రశస్తమయింది. 'కంచిమేక కుంచెడు పాలిస్తుం' దనే వాడుకకూడా వుంది.

మేకకు పర్యాయపదాలు: అజము, ఛాగము, తుభము, బస్తము, ఛగలకము, బర్కరము.

యజ్ఞపశువులలో ముఖ్యమైనది 'అజము'. 'అజము' నకు సంబంధించినది కనకనే నెయ్యిని 'ఆజ్యము' అన్నారు.

పనిచెయ్యటం ఇష్టంలేక ఎవరైనా తారుతూ జాప్యం చేస్తూవుంటే 'గుడికి వెళ్ళే మేకపోతులాగ నడుస్తున్నా' డంటారు.

మేకలమంద మధ్యగా వెళ్లకూడదనే ఒక నిషేధాన్ని మనవాళ్లు నమ్ముతారు.

మేక 'పేదవాని ఆవు' అని వాడుక.

పరమసాధువయిన వ్యక్తిని 'మేకలాంటివాడు'అంటారు.

మేక వన్యమృగాలకు ఆహారంగా ఉపయోగిస్తున్నది. అందులోనూ ముఖ్యంగా బద్ధవైరులైన తోడేలుకూ, మేకకూ ఒక విధమైన సంబంధం వుంది. 'మేకతిండి' అనగా తోడేలు.

మేక, తోడేలు సంబంధాన్ని గురించి ఒక సామెత: 'జీతం బత్తెం లేకుండా తోడేలు మేకలను కాస్తానన్నట్టు' అని.

చిన్నపిల్లలు 'పులి—మేక' ఆట ఆడుకోవటం మనం తరుచు చూస్తాం.

సాధువుగా నటించే దుష్టుని 'మేకవన్నెపులి' అంటారు.

గతించినదాన్ని గురించి విశేషంగా పొగుడుతుంటూ వుంటే :

'చచ్చిన చారమేక పాలు - పోయిన బోసిముంతెడు'

అనే సామెతను వ్యధికరణంగా వాడతారు.

ఎవరైనా గొప్పకోసం ఆడంబరంగా పని చేసేటప్పుడు: మెచ్చి మేకతోలు కప్పుతారులేవయ్యా' అనడం కద్దు.

దశమల్లినవాడు ఐశ్వర్యమంతా పోగొట్టుకొని చివరకు ఏదో వకటి మిగుల్చుకొన్న సందర్భంలో 'అమ్మగా మిగిలిన మేక' అనే జాతీయం ఉపయోగిస్తారు.

పస లేకపోయినా బుసలు గొట్టే వ్యక్తిని గురించి 'వాడిది మేకపోతు గాంభీర్యం' అని అధిక్షేపించడం కద్దు. దీన్ని గురించి బాలవాఙ్మయంలో ప్రసిద్ధమైన ఒకవినోద కథ ఉంది.

మేకకు మెడను ఉండే 'చండ్లు' కేవలం నిష్ప్రయోజన మైనవి. దీనినే 'అజాగళ స్తన న్యాయం' అంటారు.

ఇదే తెలుగులో :

'తాళ్లకు తలను చండ్లు - మేకకు మెడను చండ్లు'

అనే సామెత వ్యక్తపరుస్తున్నది.

మేకను గురించిన మరి రెండు సంస్కృత లోకోక్తులు :

అకస్మాతుగా ఒక కీడు కలిగినప్పుడు 'అజాకృపాణీ న్యాయ' మని అంటారు. అనగా 'మేక వచ్చింది, దానిమీద కత్తి పడింది' అని భావం.

'గడులికా ప్రవాహ న్యాయ' మని ఒకటున్నది. మేకల మందలో మొదటిది ఎలాగచేస్తే, తక్కినవన్నీ ఆలాగే చేస్తాయి. మొదటిది నూతిలో ఉరికితే, ఒకదాని తరువాత ఒకటిగా తక్కినవన్నీ నూతిలోకి ఉరుకుతాయి.

స్వతంత్రాలోచన లేక ఎవరేమి చెపితే దానికే తల ఊచే 'మూక'ను 'మేకల మంద'తో పోలుస్తారు.

పురాణకాలమందు దక్షయజ్ఞం ఘట్టంలో వీరభద్రుడు ఉగ్రుడై దక్షుడి తల తెగవేయటం, అప్పుడు దేవగణ

మంతా చేరి వెతికితే ఉత్తర తలాపి పెట్టుకొన్న ఒక మేక కనిపించగా దాని తలకొట్టి తెచ్చి దక్షుడికి అతికించటం- ఈ గాథ చాలా ప్రసిద్ధం.

ఈవిధంగా—మన పురాణాల్లో ఏనుగుతలవాడు గణపతీ, గుర్రపుతలవాడు తుంబురుడూ, మేకతలవాడు దక్షుడూ —బయలుదేరారు.

'అజము' రాహుగ్రహానికి వాహనమై వుంది.

ఇటువంటి ప్రాముఖ్యం గల మేకను మన వేమనకవి వ్యర్థంగా వదిలేస్తాడా? పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్విస్తూ, లోభిని వేళాకోళంచేసే సందర్భంలో ఆయన ఇలా చెప్పాడు :

"మేక కుతిక బట్టి మెడచన్ను గుడువగా
ఆక లేల మాను నాశ గాక,
లోభివాని నడుగ లాభంబు గలుగునా ?
విశ్వదాభిరామ వినుర వేమ"

ఎవరికీ తోచకుండా గోలచేసేవాణ్ని 'చెవికోసిన మేకలా ఎందుకురా అలా అరుస్తావు?' అని మందలిస్తారు.

ఎవరయినా గృహస్థు సకుటుంబంగా వచ్చి తిష్ఠవేసినప్పుడు 'పిల్లా - మేకతో' కూడా వచ్చేశా డంటారు.

నోటికి అందినదల్లా కడుపులో దట్టించేస్తుంది మేక. అందుచేతనే వంగభాషలో: 'మేక తిననిదీ, మూర్ఖుడు వాగనిదీ ఏమిటుంటుంది?' అని ఒక సామెత ప్రచారంలోకి వచ్చింది.

'నల్లమేక--విప్రుడు--నలుగురు దొంగలు' కథ తెలుగు పిల్లల నోట బాగా నలిగిందే. దీనినే సంస్కృతంలో 'భైరవ విప్రన్యాయం' అని చెబుతారు.

ఒక బ్రాహ్మడు యజ్ఞం సంకల్పించాడు. అందుకోసం సంతకి వెళ్లి ఒక నల్లమేకను కొనుక్కొని ఇంటికి తెస్తూవుండగా నలుగురు దొంగలు ఎదురుపడ్డారు. ఆ మేకను ఎలాఅయినా కాజేద్దామని వాళ్ళకు బుద్ధిపుట్టి చిత్రమైన వ్యూహం పన్నారు. బ్రాహ్మడు వెళ్ళబోయే దారిలో దూర దూరంగా నలుగురూ నాలుగుచోట్ల పొంచివున్నారు.

బ్రాహ్మడు తన పక్కనుండి పోతూవుండగా మొదటి దొంగ ఆయనను పలకరించి: 'ఏమయ్యా! వెర్రిబాపడా! ఈ నల్లకుక్కను మోసుకుపోతున్నా వెక్కడికి?' అని ఆశ్చర్యంగా అడిగాడు. 'ఇది కుక్కకాదోయ్, మేక. కనబడ్డం లేదూ?' అని అంటూ ఆ బ్రాహ్మడు ముందుకు పోసాగాడు. ఆయన రెండవ దొంగ వుండే స్థలం చేరుకునేసరికి వాడు ముందుకు వచ్చి పలకరించి ఏమీ ఎరగనట్టు మొదటివానిలాగే పరామర్శించాడు. బ్రాహ్మడికి 'ఇది కుక్కా? మేకా?' అని అనుమానం తగిలింది. అయినా, దాన్ని విడిచిపెట్టకుండా సాగిపోయాడు. అటుపిమ్మట వరసన తక్కిన దొంగలుకూడా అదేమో స్తరుగా ప్రశ్నించేసరికి బ్రాహ్మడి అపోహ బలీయమై, తను తీసుకువస్తున్నది నిజంగా కుక్కేకాబోలు నని తలచి విడిచిపెట్టివేశాడు. అప్పుడు మేకను ఎత్తుకుపారిపోయారు దొంగలు.

మన బాలకథా సారస్వతంలో తల్లి మాట వినక ఢిల్లీ వెళ్ళిన 'మేమే మేకపిల్ల' కథ ఉన్నది. తెనుగు పిల్లలకు 'మేమే మేకపిల్ల' కథ వుంటే, ఇంగ్లీషు పిల్లలకు 'Baa Baa Black sheep' గేయం వున్నది.

ప్రజ్ఞాధురీణుడైన తెనాలి రామలింగ కవికి ఒక పండితునితో పటుపటాంగం వచ్చింది. అప్పుడు చమత్కారంగా:

'మేఁకతోఁకకుతోఁక తోఁకమేఁకకుమేఁక
మేఁకతోఁకకుతోఁక తోఁకమేఁక'

అని ఈ ధోరణిలో 'మేక-తోక' అనే రెండు పదాలను ద్రొల్లిస్తూ ఒక పద్యం చెప్పి పండితుణ్ని చిత్తుచేసి, సభ్యులను రంజింపజేసి, ప్రభువును మెప్పించి, బహుమతి పొందాడు.

'ధర్మరాజు—కుక్క' కథ వంటిదే మేక విషయంలో కూడా చిన్న ఇతిహాసం ఉన్నది. కాశీక్షేత్రమందు 'సులక్షణ' అనే ఒక వనిత ఈశ్వరుణ్ణి గురించి తపస్సు ప్రారంభించింది. ఎలా వచ్చిందో కాని, ఒక మేకపిల్ల ఆమె వుండే తావుకు రావటం తటస్థించింది. రావడ మేమిటి?— అది సులక్షణను పరీక్షించటానికి వచ్చిందా అన్నట్టు ఆ తావునే ఉండిపోయింది.

అలా చిరకాలం సన్నిహితంగా వుంటున్న మేకపిల్లపైన అభిమానం కలిగింది సులక్షణకు. క్రమంగా ఆమెకు దానిపైన మక్కువ ఎక్కువయింది. మరి కొద్దిరోజులకల్లా ఆ మేకపిల్ల సులక్షణ పంచప్రాణాలలోనూ ఒకటై పోయింది!

తరువాత ఆమె తపస్సుకు మెచ్చి శివుడు ప్రత్యక్షమై, వరమిస్తా నన్నాడు. అందుకు సులక్షణ "దేవా! ముందు ఈ మేకపిల్లకే ఇచ్చి తరువాత నాకియ్యి" అన్నది. పరమేశ్వరుడు ఆమె ధర్మబుద్ధికి ఆశ్చర్యపడ్డాడు; మేకపిల్లకు, సులక్షణకూకూడా వరము లనుగ్రహించాడు.

కాశీలో ఈ సంఘటన జరిగిన ఆ ప్రదేశానికి 'బర్కా-గీ తీర్థం (మేకకుండం) అనే పేరు శాశ్వతంగా నిలిచిపోయింది.

చచ్చికూడా మేక ఎంతగానో ఉపయోగపడుతూవుంది. దాని చర్మంతో తయారుచేసిన తిత్తులలో నీరు నింపుకొని ఉత్తర హిందూస్థానంలో భిస్తీలు (నీళ్లు మోసేవాళ్లు) బాటసారుల దప్పికను తీరుస్తూవుంటారు.

ఈ విధంగా, బతికీ చచ్చీకూడా మానవునికి గతులు కల్పించే మేక ధన్యజీవికదా!



# సాహిత్యంలో 'గొఱ్ఱె'

'చలి చలి నంగప్ప
గొంగడి కప్పుకొ గోనెప్ప'

అని రాయలసీమ ప్రాంతంలో ఒక వాడుక ఉంటున్నది. గొంగడి అనగానే గొఱ్ఱె జ్ఞాపకానికి వస్తుంది. గొఱ్ఱె బొచ్చుతో నేసిన 'కంబళి' 'గొంగడి' మనలను చలినుండి కాపాడుతున్నవి కనుక గొఱ్ఱెను గురించిన భోగట్టా తెలిసికోవలసిన అవసరం ఎంతైనా వుంది.

గొఱ్ఱె పోతునే 'పొట్టేలు' అని అంటారు.

గొఱ్ఱెకు—గొఱియ, మేషము, తగరు, ఉరభ్రము, ఉరణము, వృష్ణి, ఊర్ణాయువు, ఏడకము—అనికూడా పేర్లున్నవి.

మనవాళ్ళు 'మేషరాశి'కి సంబంధించింది మేక అని అనుకుంటూ వుంటారు. కాని, నిజానికి అది పొట్టేలే. అన్నట్టు, రాసుల సంబంధమే కాదు. మేషానికి అగ్నిదేవుని వాహనమై వుండటమనే ఆధిక్యతకూడా వుంది.

పౌరాణికంగా గొఱ్ఱెను గురించిన ఒక ఆధ్యాత్మికగాథ:

పూర్వం కాశీనగరంలో ఒక గొప్ప పండితుడు ఉండేవాడు. ఆయన ఆశ్రమంలో చాలామంది విద్యార్థులు చదువుకుంటూ వుండేవారు. ఒక రోజున పండితుడు ఒక గొఱ్ఱెను రప్పించి శిష్యులతో, "ఇవాళ పితృదేవతల పేరు చెప్పి విందు చేయాలి. కనుక దీనిని గంగలో స్నానం చేయించి అలంకరించి మేళతాళాలతో తీసుకరండి. బలి యిద్దాము" అన్నాడు. "మహాప్రసాదం" అంటూ శిష్యులు దానిని నదికి తీసుకుపోయారు.

అక్కడ దానిని స్నానం చేయించి చక్కగా అలంకరించి బొట్టు పెట్టుసరికల్లా దానికి పూర్వజన్మ స్మృతి కలిగింది. ఒక్కసారి గట్టిగా నవ్వి, అది యేడ్వ నారంభించింది. విద్యార్థులు ఆశ్చర్యంతో దానిని గురువువద్దకు తీసుకుపోయారు. అప్పుడు పండితుడు దానిని ప్రశ్నించేటప్పటికి అది మానవభాషలో దాని పూర్వజన్మ వృత్తాంతం ఇలా వినిపించసాగింది:

"గత జన్మలో నీలాగే నేనూ ఒక విద్వాంసుణ్ణి. విద్యార్థులకు చదువు చెప్పేవాణ్ని. పితృదేవతలను సంతోష

పెట్టడానికని ఒకసారి ఒక మేషాన్ని బలియిచ్చాను. దానికి ఫలితంగా ఇప్పటికి ఒకటి తక్కువ అయిదువందల సార్లు వధింప బడ్డాను. ఈ తడవతో నాకింక విముక్తి కలుగుతుందికదా అని నవ్వాను. తదుపరి—'అయ్యో! ఎంత పాండిత్యం వుంటేనేమి? వెర్రివాడై హింస చేస్తున్నాడే—ఇటువంటి పాపంనుండి ఎవరు రక్షించగలరు? నేను పోయిన దుర్గతికే నీవూ పోవలసి వస్తున్నదే' అని ఏడ్చాను.''

ఈ మాటలు వినగానే పండితుడు ''నీ మాటలు నిజమే. ఐతే నిన్ను బలియివ్వను. వదిలేస్తాను'' అన్నాడు. అందుకు ఆ మేషం ''ఓయి పిచ్చివాడా! నీవు వదిలేసినా ఇప్పట్లో నాకు మరణం తప్పదు సుమా!'' అన్నది. అప్పుడు పండితుడు, ''నీకు వచ్చిన భయమేమీ లేదు. నేనూ, నా శిష్యులూ నీ వెంటే వుండి రక్షిస్తాం'' అని చెప్పాడు. అందుకు గొర్రె ''బ్రహ్మరాత తప్పించడానికి నీతరం కాదుసుమా!'' అని ఆక్షేపించింది. పండితుడు తన ప్రయత్నం మానక ఏం జరగబోతుందోనని శిష్యులతో సహా దాన్ని కనిపెట్టి చూస్తూ వున్నాడు. ఆ గొర్రె మేస్తూ మేస్తూ పోయి ఒక కొండ ఎక్కింది. హఠాత్తుగా ఒక పిడుగుపడి కొండరాళ్లు పగిలి అవి మీదకు దొర్లి ఆ గొర్రె చచ్చి వూరుకుంది.

ఈ వైనం తెలుసుకొని పండితుడు ఆశ్చర్యపోయాడు. అతనికి జ్ఞానోదయం అయింది.

మన పురాణాలలో శ్రీకృష్ణుడు గోవులను కాసే గోపాలుడు అయినట్టుగానే, మహాప్రవక్త ఐన ఏసుక్రీస్తు గొర్రెల కాపరి అయినాడు.

యోహాను సువార్త 10-వ ప్రకరణం (V.I-18) లో క్రీస్తే ఇలా సెలవిచ్చాడు: "నేను మంచి గొర్రెల కాపరిని. మంచి గొర్రెలకాపరి గొర్రెలకోసం తన ప్రాణాలనైనా బలి యిస్తాడు. కాని కూలికి కాసే కాపరి నిజమైన కాపరి కాడు. ఎందుచేతనంటే, గొర్రెలు తనవి కాకపోవటంచేత, తోడేలు రావటం చూస్తూనే గొర్రెలను వదిలేసి పారిపోతాడు. తోడేలు వచ్చి గొర్రెలను వేసుకపోతుంది..."

క్రీస్తు చెప్పిన ఉపమానాలలో 'తప్పిపోయిన గొర్రె' (Parable of the lost Sheep) చాలా ప్రముఖమైంది.

గ్రీకు పురాణాల్లో మంచి రసవంతమైనది బంగారు ఉన్ని-(The Golden Fleece) కథ: అనగనగా ఒక పొట్టేలు. దాని పేరు 'క్రైసోమేలస్' (Chrysomallus). దాని ఉన్ని యెన్నిక గన్నది. అది చచ్చిపోయిన తరువాత దాని ఉన్ని 'కొల్చిస్' (Colchis) నగరపు పొలిమేరలో ఒక చెట్టుకి వేలాడదీయబడింది. దానిని ఒక భయంకరమైన భూతసర్పం కాపలాకాసేది. తదుపరి, జేసన్ అనే ధీరుడు అనేక సాహసచర్యలు నెరపి, 'ఆర్గో' (Argo) అనే ఓడలో బయల్దేరి వెళ్ళి, ఆ బంగారు ఉన్నిని సాధించి తెచ్చుకుంటాడు.

ఒకదానిని ఒకటి ఢీకొనటంలో పొట్టేళ్లను మించినది లేదు. పౌరుషానికి పొట్టేలు పెట్టింది పేరు. అందుకనే మన దేశంలో కోడిపందెములలాగానే పొట్టేళ్ల పందెములు కూడా ఎక్కువగా వ్యాప్తిలో వుంటున్నయి.

పొట్టేళ్లు ఢీకొట్టవటం సందర్భంలో 'పంచతంత్రం' లోని 'దేవశర్మ' కథ స్మరించిక తప్పదు:

దేవశర్మ కపటసన్యాసి. ప్రజలకు వేదాంతం ఉపదేశిస్తూ వారిచ్చే దక్షిణలు ఒక బొంతలో పదిలపరుస్తూ ఆ బొంతను విడువకుండా యెప్పుడూ కప్పుకుంటూ ఉండేవాడు. ఈ సంగతి గ్రహించిన 'ఆషాఢభూతి' అనే మాయలవాడు అతనివద్ద ధర్మోపదేశం పొందడానికి శిష్యుడుగా చేరాడు. శిష్యుణ్ణి గురువు పూర్తిగా నమ్మాడు. నమ్మిన కొద్దిరోజులకు బొంత శిష్యుడికి మోయటానికి ఇచ్చాడు. ఇచ్చి సంధ్యవార్చుకోటానికి చెరువులో దిగాడు. ఆ సమయంలో రెండు మేషాలు రోషంతో డీకొంటూ దారుణంగా పోట్లాడటం దేవశర్మ కళ్లబడింది. వాటి తలలు పగిలి నెత్తురు కారి పేరుకొన్నది. అది చూచి ఒక నక్క మాంసమని భ్రమించి అక్కడకు పోగా వెనకకు తగ్గిన అవి మళ్లీ రెట్టింపు పౌరుషంతో డీకొ్కనేసరికి నక్క వాటిమధ్య నలిగి చచ్చింది. దేవశర్మ ఇదిచూచి "లోభగుణంచేతనేకదా నక్క చచ్చింది" అని చింతిస్తూ చెరువుగట్టు యెక్కేసరికి శిష్యుడు కనపడలేదు. వానికోసం వెతికి వెతికి చివరకు మోసం తెలిసి కొని "మేషయుద్ధం వల్ల నక్కచెడింది; ఆషాఢభూతివల్ల నేను చెడ్డాను" అని వాపోయాడు.

పొట్టేళ్ల పోరాటమే మూలంగా గల 'హూరేషియస్' గాధ రోమన్ చరిత్రలో చాలా ప్రసిద్ధమై వుంది.

'కొండను గొర్రె డీకొన్నట్లు' అని ఒక సామెత వుంది. అనగా—కొండను డీకొనటంవల్ల గొర్రెతలకాయ బద్దలవటమే గాని కొండ యెంత మాత్రం చలించదు. 'మేరువువంటి ధీరులను యెదుర్కొనటంవలన అల్పులకే నష్టం' అని చెప్పటానికి ఈ సామ్యం ఉపయోగిస్తాము.

ఈ 'జాతీయం' కవితాలోకంలో ఎంత విస్తృత వ్యాప్తిలో ఉన్నదో క్రింది పద్యాలలో విశదమవుతున్నది.

'తగిలి మదంబుచే నెదిరిఁ దన్ను నెఱుంగక దొడ్డవానితోఁ
బగగొని పోరుటెల్ల నతిపామరుఁడై చెడు టింతెకాక తా
నెగడి జయింపనేరఁ డది నిక్కము తప్పదు ధాత్రిలోపలన్
దెగి యొక కొండతోఁ దగరు ఢీకొని తాఁకిననేమి భాస్కరా'

—భాస్కర శతకము.

'కొండపై కోపించి గొఱ్ఱె ఢీకొనిన
కొండ చలింపదు గొఱ్ఱెకే చేటు'

—పూర్వకవి

'ఎదిరి బలమును దనశక్తి నెఱుఁగకుండ
బలియుఁ దాఁకిన మూర్ఖుఁడు భంగపడఁడె;
తగరు పొగరునఁ గొండను దాఁకునేని
వెంటనే దాని కొమ్ములు విఱిగిపోవె'

—చిలకమర్తి.

'దుష్టు సూర్యునిదెస దుమ్మెత్తి చల్లినఁ
దనపైనె పడుఁగాక దాని కేమి
కొండతోఁ దగరు ఢీకొని యెంతతాఁకినఁ
దలవ్రక్కలగుఁ గాక దాని కేమి
మిడుతలు చిచ్చుపై వడి నెంత యెగసినఁ
దామె పొక్కుఁడుఁ గాక దాని కేమి
వలఁ బడ్డ మీ నెంతవడిదాఁక బొరలినఁ
దనుఁ జుట్టుకొనుఁగాక దాని కేమి
ఎదిరి సత్త్వంబు తనసత్త్వ మెఱుఁగలేక
పోరువాఁ డెందు నవివేకబుద్ధియంద్రు
కలితలక్ష్మీశ సర్వ జగన్నివేశ
విమల రవికోటిసంకాశ వేంకటేశ'

—తాళ్లపాక తిమ్మనార్యుడు.

గొర్రెను గురించిన మరికొన్ని సామెతలు :—

'గొర్రె యేడిస్తే తోడేలుకు విచారమా?'
'తోడేటిని గొర్రెలు కాయబెట్టినట్లు'
'గొడ్లను కాచేవాణ్ణి కొట్టనివాడూ
గొర్రెల్ని కాచేవాణ్ణి తిట్టనివాడూ లేడు'
'కోసేవాణ్ణి కాని గొర్రె నమ్మదు'
'గొర్రెను చంకన బెట్టుకొని గొల్లడు వెదికినట్లు'
'గొర్రె బలిస్తే గొల్లవానికే లాభం'
'గొల్లవాళ్ల గోత్రాలు గొర్రెలకి తెలుసు;
గొర్రెల గోత్రాలు తోడేళ్లకి తెలుసు'

మామూలుగా మనం చూచే గొర్రెలు కాక, దక్షిణ అమెరికాలో లామా, ఆల్పాకా అనే జాతి గొర్రెలు వున్నాయి.

ఆస్ట్రేలియాలో వుండే ఒకజాతి గొర్రెను తోకలో క్రొవ్వు పేరుకొని తెగబలిసి వుంటుంది.

అయితే 'ఎంత ఎదిగినా గొర్రెతోక బెత్తెడే'. ఈ సామెతను తరుచు ఉపాధ్యాయుల జీతాలు చాలకపోవటము గురించి వ్యంగ్యంగా చెపుతారు. దీన్నే—అభివృద్ధి లేని సందర్భంలో 'గొర్రెతోకలాగ ఎదుగూ లేదు; బొదుగూ లేదు' అని అనటం కద్దు.

సహజంగా గొర్రె సాధుజంతువే. అయితే, 'కర్ర లేని వాణ్ని గొర్రె అయినా కరుస్తుం'దని చెపుతారు పెద్దలు. దీన్నే దైవబలాన్ని సమర్థించేపట్ల కవి చౌడప్ప ఇలా అంటున్నాడు :

'పులి నాకి విడుచు దైవము
గలవానిని దైవబలము గలుగని వేళం

గలహించి గొఱ్ఱె గరచును
కలియుగమున కుందవరపు కవిచౌడప్పా'

కలిసి చేసే వ్యాపారంలో ఏ ఒక్కడికీ పూర్తి బాధ్యత ఉండక త్వరలోనే విచ్ఛిన్నమై పోవటం కద్దు. దీన్నే 'ఉమ్మడి గొఱ్ఱె పుచ్చి చచ్చింది' అంటారు.

ఒక సంస్థకు దుష్టుడైన అధికారి ఉంటాడు. అతని తదనంతరం వచ్చే అధికారి మరీ దుష్టుడై వుంటే, 'కోళ్లను తినే వాడు పోతే గొఱ్ఱెల్ని తినేవాడు వచ్చాడురా, బాబూ!' అని పనివాళ్లు వాపోతారు.

గొఱ్ఱెపాలు ఎంతశ్రేష్ఠమో దాని ఎరువు కూడా అంత శ్రేష్ఠమైనదే. అందుకోసమే పొలాలకు బలం చేయడానికి గొఱ్ఱెల మందలను, మేకల మందలను కడతారు. దీన్నిబట్టే: 'గొఱ్ఱె తొక్కినా చాలును' అనే సామెత పుట్టింది.

ఎంత ముఖ్యమైందీ కాకుంటే, మన పెద్దలు, 'పెద్ద తల లేకపోతే గొఱ్ఱెతల తెచ్చుకో'మంటారు, చెప్పండి!



# సాహిత్యంలో 'గుఱ్ఱం'

"నాన్నా! గుర్ర మెక్కించుకోవూ?" అంటూ చిన్న బిడ్డలు వీపుమీద కెగబడతారు. గుర్రమనే జంతు వొకటి వున్న దనీ, అది స్వారికి పనికివస్తుందనీ, దానిమీద ఎక్కి సరదా తీర్చుకోవచ్చుననీ పసిపాపలకు ఎలా తెలుస్తుందో? పెద్దవాడైన తర్వాత నిజమైన గుర్రంమీద స్వారిచేయటానికి ముందుగా ఇప్పటినించీ నాన్న వీపుమీద 'గుర్రమెక్కటం' సాధకం చేస్తున్నాడన్న మాట. గుర్రాన్ని కంటితో చూడకపోయినప్పటికీ పసిపాప హృదయంలో ఇన్ని ఊహాలు ఎలా బయల్దేరుతాయో చాలా చిత్రమైన విషయమే.

ఒక్కసారి పురాణకాలంవేపు తిరిగి చూస్తే అశ్వాన్ని గురించిన అద్భుత విషయాలు ఎన్నో గోచరిస్తాయి:

పూర్వకాలమందు అశ్వములు, గజములు మొదలైన జంతువులకూ, పర్వతములకూకూడా రెక్కలుండేవట. ఐతే, ఈనాడు మన కంటికి అటువంటి చిత్రాలేవీ కనుపించవేమీ?— అనేది ప్రశ్న. ఈ సందర్భంలో అశ్వములను గురించిన ఒక వింత గాథ తెలుసుకుందాం :

"ఆ కాలమందు గుఱ్ఱములు రెక్కలతో కూడి ఆకాశ సంచారం కలిగి, గంధర్వుల ఇష్టములను సమకూరుస్తూ ఉండేవి. రెక్కలూ, ఆకాశ సంచారమూ కలిగిన ఆ అశ్వములను చూచేసరికల్లా దేవేంద్రునికి కన్నెర్ర అయింది.

అప్పుడు శాలిహోత్ర మునీశ్వరునిచూచి దేవేంద్రుడు—

"మునీశ్వరా - తమకు మూడులోకములలోనూ అశక్యమైనది లేదు. అశ్వములకు పక్షచ్ఛేదము చేసి, అవి యుద్ధ వాహనములయ్యేటట్టుగా, వానివల్ల నేను శత్రువులైన రాక్షసులను జయించి త్రిభువన సామ్రాజ్యపూజితుడ నయ్యేలాగున అనుగ్రహించ వలసింది" అని ప్రార్థించాడు.

అప్పుడు—శాలిహోత్ర మహాముని 'ఇషీక' అనే అస్త్రం ప్రయోగించి, అశ్వముల రెక్కలు ఛేదించాడు.

రెక్కలు ఊడిన అశ్వములు దైన్యంతో శాలిహోత్ర మహామునీశ్వరుణ్ణి చూచి :

"భగవత్స్వరూపుడైన ఓ శాలిహోత్ర మహామునీ!— ఏ అపరాధము చేయని మాకు పక్షచ్ఛేదము చేస్తిరి. ఇక మాకు తామే దిక్కు. మాకు సర్వదా సౌఖ్యము వుండులాగున అనుగ్రహించవలసింది" అని మొరపెట్టుకున్నాయి.

శాలిహోత్ర మునీశ్వరుడు దయ గలిగినవాడై, దుఃఖిం చుచున్న అశ్వముల చూచి, "ఓ అశ్వములారా!— దేవేం ద్రుని ప్రార్థనవల్ల మీకు తీరని దుఃఖములను కలగజేసితిని. కాబట్టి, ఈ మూడు లోకములందును మీకు సుఖము, పూజ్యత కలిగివుండేలాగున అనుగ్రహిస్తూవున్నాను. సూర్య చంద్రాదుల కున్ను, భూపతులకున్ను వాహనములై, మీరు విశేష గౌర వము పొందగలరు' అని చెప్పాడు.

శాలిహోత్రుడు శివుని అనుగ్రహమువల్ల అశ్వ హృద యాభిజ్ఞుడయిన తర్వాత శిక్షావిశేషములు నేర్పబడి, అశ్వములు శాలిహోత్ర ఋషికి స్వాధీనములయినాయి.

ఒకానొకప్పుడు దేవతలకు, రాక్షసులకు యుద్ధము ప్రసక్తము కాగా దేవతలు ఉపచారోక్తులవల్ల శాలిహోత్రుని స్తుతిజేశారు. ఆ దేవతల స్తుతిచేత సంతుష్టుడైన శాలిహోత్ర మహర్షి వారికి ఉత్తమములైన అశ్వములను ఇచ్చెను. ఆ శాలి హోత్రునిచేత అనుజ్ఞాతులై దేవతలు అశ్వములనే వాహనము లుగా జేసికొని రాక్షసులను జయించిరి. అది మొదలుకొని వాహనములలో అశ్వములు శ్రేష్ఠమయిన ఖ్యాతిని పొందిన వాయెను.

ఇటువంటి ఉత్తమజాతికి చెందిన అశ్వములలో 'ఆజా నేయం' అనేది ఒకటి. ఇది అనేకమైన శుభలక్షణాలు కలిగి నటువంటి అశ్వం. యుద్ధరంగంలో దెబ్బలు తగిలి, పేగులు బయటికి వచ్చినప్పటికీ — మృత్యువు ఆవహించినప్పటికీ— యోధుడు తనమీద ఉన్నంతకాలమూ తన ప్రాణాలను నిలుపుకోగల విశేషం కలదట ఈ జాతి అశ్వం!"

సర్వసాక్షి అయినటువంటి సూర్యభగవానుడి రథానికి ఏడు గుర్రాలు. దీన్నిబట్టే ఆయనకు 'సప్తాశ్వమభ్రమణి మా శ్రితపారిజాతం' అని బిరుదు వచ్చింది.

ఈ యేడు గుర్రములే సూర్యకిరణములలో దాగివున్న ఏడు రంగులు Vibgyor అని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు.

సూర్యభగవానుడు గుఱ్ఱం రూపంలోవచ్చి యాజ్ఞ వల్క్యునికి శుక్లయజుర్వేదాన్ని, యజుస్సులనూ ఉపదే శించాడట.

సూర్యభగవానునివల్ల సంధ్యాదేవియందు జన్మించిన వాళ్ళు అశ్వినీదేవతలు. వీరి జన్మకథ చాలా చిత్రమైనది.

'గుర్రపుచుక్క' అనగా 'అశ్విని' - ఆకాశంమీాద ఉండే మొట్టమొదటి నక్షత్రం.

కశ్యపుని భార్యలయిన కద్రువ, వినత 'ఉచ్చైశ్రవం' అనే 'గుర్రపుతోక'రంగును గురించి పందెం వేసికొనటం, పర్యవసానం ఫలితంగా తాచుపాములకు నాలుకలు చీలిపోవటం —ఇది వక వింతగాథ.

దేవతాగణాలలో 'కిన్నరులు' గుర్రపుమోము వేలు పులు. వారిలో ముఖ్యుడు అందరకూ తెలిసిన తుంబురుడు.

కింపురుషులకు నరముఖము, అశ్వశరీరం అమరివున్నాయి.

గ్రీకుపురాణాల్లో 'Centaurs' అనే జాతివాళ్లు ఉన్నారు. వీళ్ళ తలమాత్రం మనిషితల. మిగతా అంతా గుర్రం స్వరూపమే.

'అశ్వహృదయం' అనేది గొప్ప విద్యలలో ఒకటి. ఇందులో ప్రవీణులయిన పురాణపురుషులు నలుడు, నకులుడు.

నకుల సహదేవుల గుర్రాలు తెల్లగుర్రాలు. ఆ గుర్రాల మీద వారు చినుకు చినుకు మధ్యనుంచి పోగలిగేవారట.

ఈ కలియుగాంతమందు అవతారపురుషుడయిన 'కల్కి-మూర్తి' తెల్లగుర్రంపైన ఎక్కివస్తాడని కల్కి-పురాణం చెప్పుతున్నది.

'కాదంబరి' కథలో 'ఇంద్రాయుధం' అనే అశ్వం చాలా ప్రముఖమైనది.

గంగను భూమికి తెచ్చిన భగీరథ ప్రయత్నానికి గల మూలకందం అశ్వమును గురించిన అపోహ.

లక్ష్మీదేవి శాపంవల్ల విష్ణుమూర్తి తల ఊడిపోయింది. అప్పుడు గుర్రపుతల తెచ్చి అతికించారు దేవతలు. అందుకనే విష్ణువుకి 'హయగ్రీవు'డని పేరు వచ్చింది. హయగ్రీవుడు విద్యకు అధిదేవత. ఈ హయగ్రీవుడే బ్రహ్మకు వేదోపదేశం చేశాడు.

పురాణములలో చెప్పబడిన దధ్యంగుడు, గాలవుడు మొదలైన మరికొందరి గాథలూ అశ్వానికి సంబంధించినవే.

ఇంద్రుని అశ్వం 'ఉచ్చైశ్శ్రవము'. క్షీరసముద్రమును మథించినపుడు అందులోంచి పుట్టింది. 'దశావతార చరిత్ర' దానిని ఇట్లా వర్ణిస్తోంది :

'కర్పూర కదళికా కళికాదళంబుల
 నెఱమించు విచళించు నిక్కుఁ జెవులు
నేలినవానికిఁ ద్రైలోక్య సామ్రాజ్య
 లక్ష్మి నియ్యఁగఁ జాలు లక్షణములు
మానసాధికవేగ మూనఁగా జపియించు
 పోలికఁ గదలెడు ప్రోథపుటము

తామరసాప్త నందనుని వాహమునకు
రోషంబుఁ బుట్టించు హేషితంబు
గలిగి శరదిందు కందళత్కుంద బృంద
కుంద గోవింద తుందారవింద కంద
చందనామంద రుచినందచంద మగుచు
నొనరు నుచ్చైశ్రవంబు నేత్రోత్సవముగ'

ద్రోణాచార్యుని కొడుకు పుట్టగానే 'ఉచ్చైశ్రవం' లాగా అరిచాడట. అందుచేత ఆకాశవాణి అతడికి 'అశ్వత్థామ' అనే పేరు పెట్టింది.

పూర్వం గొప్ప గొప్ప రాజులు 'అశ్వమేధయాగం' చేసేవారు. ఈ అశ్వమేధయాగంవల్లనే శ్రీరామచంద్రుడూ కుశలవులూ, అర్జునుడూ భద్రుబువాహనుడూ — మొదలైన వాళ్లంతా సమాగమం కావటం తటస్థించింది.

మనదేశంలో పుష్యమిత్రుడు, సముద్రగుప్తుడు, మొదటి కుమారగుప్తుడు కూడా అశ్వమేధయాగం చేసినట్టు చరిత్రలు చెబుతున్నవి.

క్రైస్తవులు చనిపోయినప్పుడు మృతకళేబరాన్ని తీసుకు వెళ్లే నల్లటి బండికి నల్లటి గుర్రాన్ని కడతారు.

మంచిలక్షణాలు గల గుర్రాన్ని 'పంచకల్యాణి' అంటారు. గుర్రాలల్లోకల్లా అరబ్బీగుర్రాలు, సింధుదేశపు గుర్రాలు ఖ్యాతి గాంచినయి.

ఘోట(క)ము, వీతి (పరుగెత్తేది), తురగము, తురంగ(మ)ము (వడిగా పోయేది); అశ్వము, వాహము, వాజి, గంధర్వము, హయము, సైంధవము (సింధుదేశమునపుట్టినది); సప్తి, అర్వము, వారువము అని కూడా గుర్రానికి పేర్లు.

ఆడుగుర్రం పేర్లు :—వామి, అశ్వ, బడబ, ఘోటిక, ఘోటీ, గోడిగ. ఆజానేయం, కులీనం—అనేవి మేలుజాతి గుర్రాలు.

గుర్రాలు ఎన్నిరకాలు ?— అనే ప్రశ్నకు ఇలా బదులు చెప్పవచ్చు : యుద్ధపు గుర్రాలు, స్వారి గుర్రాలు, పందెపు గుర్రాలు, సర్కస్ గుర్రాలు, రథం లాగే గుర్రాలు, జట్కా గుర్రాలు.

అశ్వశకటములలో రకరకాలు—జట్కా (మద్రాసు); టాంగా (దక్కను) ; సారటు ; బగ్గీ; ఎక్కా (ఉత్తర) ; రథం (యుద్ధసంబంధం).

ప్రత్యేకించి గుర్రాలమీాదనే ఆడే 'పోలో' మొదలైన ఆటలు ఉన్నాయి. ఈ ఆటలకు తగిన గుర్రాలూ ఉన్నయి.

ఇంగ్లీషువారు మొట్టమొదట మన దేశం వచ్చినప్పుడు వారికి అశ్వికదళం లేనేలేదు. అప్పటికి హైదరాలీ, టిప్పుసుల్తాన్ మాత్రమే ఇటువంటి బలమును సమకూర్చుకొన్న ప్రముఖులు.

పందెపు గుర్రా లనగానే మదరాసులో 'గిండీ రేసులు' విదేశాలలో 'డెర్బీ రేసులు' జ్ఞాపకం వస్తాయి.

క్షత్రియులు నేర్చుకోవలసిన విద్యలలో మొట్టమొదటిది గుర్రపుస్వారీ.

గుర్రపురథాన్ని నేర్పుతో నడిపే చోదకుణ్ణి 'సారథి' అంటారు. అర్జునుడి రథాన్ని నడిపిన శ్రీకృష్ణభగవానుడు గొప్ప 'సారథి.' 'సారథ్య' మనేది చాలా భావగర్భితమయిన పదం. 'సారథ్యం' అన్నప్పుడు 'శల్య సారథ్యం' అనే మాటలోని అంతరార్థంకూడా తెలుసుకోవలసిన అవసరం వుంది.

అర్జునుడికి 'కృష్ణసారథ్యం' ఎంతో మేలుకూర్చింది. కర్ణుడికి 'శల్యసారథ్యం' హృదయశల్యమై వేధించింది.

'గుర్రాలక్క'ను గూర్చి తెనుగునాట చాలామంది వినే వుంటారు. ఈ సందర్భంలో 'చారిత్రక పరిశోధక చక్రవర్తి' శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు కొన్ని వింతలను ఇలా వెల్లడిస్తున్నారు :—

"బౌద్ధుల కయితనేమి, హిందువుల కయితనేమి దేవుని మీద ఒక విధమైన విశ్వాసముండేది. హిందువులకూ, బౌద్ధులకూ మాత్రమేకాదు, గుర్రపువర్తక వ్యాపారము చేస్తూ వచ్చిన మూరులకుకూడా ఈ విధమైన విశ్వాసము లేకపోలేదు. గుర్రపువర్తక వ్యాపారస్తులు గుర్రములుదింపే రేవుపట్నాల లోను, వారి వ్యాపార మార్గాలలోను 'గుర్రాలపరమేశ్వరి'కి గుళ్లుండేవి. గుర్రాల పరమేశ్వరి అన్నది అశ్వవ్యాపారాధిదైవతము. పూర్వకాలములో అంతర్వేది-నరసాపురము దగ్గరది. గుర్రపు వర్తకులు గోలకొండకు గుర్రములను అమ్మకమునకు తీసికొని పోవుటకు మంచి రేవుపట్నముగా ఉండేదేమో. ఇక్కడ గుర్రాల పరమేశ్వరికి ఆలయమున్నది. అంతర్వేది నరసింహస్వామికి (నరసన్నకు) అక్కగారట ఈ గుర్రాల పరమేశ్వరి (గుర్రాలక్క). రథోత్సవమునాడు అంతర్వేది నరసన్న-సంవత్సరానికొకమారు-గుర్రాలక్కను చూసివస్తూవుంటాడు".

ఎవరయినా మూతి వంకరగా తిప్పితే —'గుర్రాలక్క మూతి'లా ఉందని ఆక్షేపిస్తారు. దీనిని గురించి సింహాచల క్షేత్రానికి సంబంధించిన ఒక గాథ విశాఖమండలంలో ప్రచారమై ఉంది.

మన జానపద కథల్లో రాజులకు రాణులమీద మక్కువ తప్పటం, అందుకు శిక్షగా రాణులను గుర్రాలసాలలో పెట్టించి సోలెడు మొక్కజొన్నలు కొలిపించి వండుకు తినమని యివ్వటం తరుచు కనిపిస్తుంది.

'పాదరసం' తియ్యటానికి గుర్రం అవసరం చాలావుంది. ఎలా అంటే: పాదరసం శివుని వీర్యం. అది భూమి అడుగున గనుల్లో వుంటుంది. శాస్త్రజ్ఞులు ఈ పాదరసపు గనులుండే తావులు కనిపెడతారు. గని తవ్విన తరవాత ఒక బలిష్ఠమయిన ఉత్తమజాతి అశ్వంమీద అతిరూప సౌందర్యవతి అయిన ఒక కన్యకామణి ఎక్కి వెళుతుందట. అశ్వంమీద ఎక్కివచ్చిన ఆ కన్య కంటబడటంతోనే భూమి అడుగున ఉండే 'పాదరసము' ఉద్రేకంతో పొంగి పొరలి నేలమీదకు వస్తుందట. అది పొంగి రావటం గమనించి కన్యకామణి దౌడుతీస్తుందట. పాదరసం సేకరించే విధానాన్ని గురించి ఇదీ పూర్వుల నమ్మకం.

పూర్వకాలమందు—అనగా షహ్జాచక్రవర్తి కాలంనాడు 'టపాను' 'బేగీరావు'ల మీంద పంపేవారు.

మనదేశంలో చాలా జాతుల్లో పెళ్లికొడుకును గుర్రం మీద ఊరేగిస్తారు.

1892 లో నేపాల్ ప్రభువు తపాలా బిళ్లలమీద ఒక నల్లగుర్రాన్ని చిహ్నంగా ముద్రించాడు. ఈనాడు మన అర్ధణా బిళ్లమీద 'కోణార్క అశ్వము'ను చూడవచ్చు.

'అశ్వపరీక్ష' చేసేందుకు పూర్వం శాస్త్రజ్ఞులు ఉండే వాళ్ళు. గుర్రంయొక్క లక్షణాలనుబట్టి వాళ్ళు దాని భవిష్యత్తును చెప్పగలిగేవారు.

అశ్వసంబంధమైన స్థలాల్లో కొన్ని: గుర్రాలకొండ (విశాఖజిల్లా); గుర్రంకొండ (కడపజిల్లా); అశ్వతీర్థం (కన్యాకుబ్జం) - వీటి వెనుక వినదగిన చారిత్రక అంశా లున్నాయి.

ప్రపంచ చరిత్రలో అశ్వములు ప్రముఖ స్థానాన్ని సంపాదించుకున్న వనటానికి అనేకమైన నిదర్శనా లున్నవి. ఏనుగుల మీద ఎత్తివెళ్లి ఎదిరినిలువలేక ప్రభువులు వెనుకకు మళ్లిన ఘట్టాలలో అశ్వములు అతిశయించి విజయము కాంచిన ఉదంతాలు ఇనుమిక్కిలిగా కనబడుతున్నాయి. అట్టి అశ్వములలో అలెగ్జాండరు గుర్రం - బ్యూసిఫేలస్; రాణా ప్రతాపుని గుర్రం 'చొటిల్' పేర్కొనదగినవి. ప్రఖ్యాతిగన్న రాణా అమీర్ సింగ్ గుర్రం పేరు 'బాజ్ బహదర్'.

అశ్వముల సాయంతో అపూర్వ విజయములు సాధించిన మరికొందరు:

జంగిస్‌ఖాన్, ఝూన్సీ లక్ష్మిబాయి, ఛత్రపతి శివాజీ-- మొదలైనవారు.

వనాయుజ, పారసీక, కాంభోజ, బాహ్లీక దేశాల గుర్రములు పేరు పొందినవి—అని అమరకోశం.

'గజపతు'ల లాగానే అశ్వపతులూ ఉన్నారు.

"మధ్యయుగమున అరేబియా, పారశీకాది దేశముల నుండి ఈ దేశముమీదికి ఎత్తివచ్చిన ముసల్మానులు తమతమ దేశములందు అశ్వములు విరివిగ దొరుకునవి అగుట అశ్వబలమున కెక్కువ ప్రాముఖ్యము నిచ్చిరి.

అశ్వబలమున కెక్కువ ప్రాముఖ్య మిచ్చుటచే వారికి 'అశ్వపతులు' అను వ్యవహారనామము ఏర్పడెను"—అని

శ్రీ ఆంద్ర శేషగిరిరావుగారు 'అశ్వపతు'లను గూర్చిన విశేషాలను వివరిస్తున్నారు.

గుర్రములను గురించి తెలిసికోవలసిన కథలు, గాథలూ:

అశ్వహృదయం (శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి); చిన్న పద్మనాభుడు, యాచమనాయడు, కీలుగుర్రం (అరేబియన్ నైట్సు)

గుర్రాలకు సంబంధించిన నానుడులు మన నిత్యజీవితంలో ఎన్నో వున్నాయి: 'కాతుకొద్దీ గుర్రం.'

''కాతు మెత్తనైతే గుర్రం మూడుకాళ్ళతో దాడు తీసిందట.''

కూలికి చేసే పనిలో శ్రద్ధ వుండదని చెప్పటానికి 'అద్దెకు వచ్చిన గుర్రాలు అగడ్తలు దాటుతాయా?' అని అడుగుతారు.

సోమరిపోతులనిగురించి పుట్టిన సామెతలు రెండున్నాయి:

'గుడ్డిగుర్రానికి పళ్ళుతోమటం.'

'కుండల్లో గుర్రాలు తోలటం.'

పనీ పాటూ లేని సాపాటురామన్నలను 'గుర్రం గుడ్డిదయినా దాణాకు లోపం లేదు' అంటారు.

స్వప్రయత్నం ఏమీలేకుండా తలవనితలంపుగా ఎవడికయినా అదృష్టం కలిసివస్తే 'గుడ్డిగుర్రపుతాపుగా పైకివచ్చా'డంటారు.

ఇష్టంలేని పని చేయించటం అసాధ్యమని చెప్పవలసివచ్చినప్పుడు—'గుర్రాన్ని చెరువుకు తీసికెళ్ళగలం కాని, దానిచేత నీళ్ళు తాగించగలమా?' అని ప్రశ్నిస్తారు.

ఎవరయినా ఒకపనిని అవకతవకగా చేస్తే 'గుర్రం తోకకు కళ్లెం పెట్టినట్లు ఉంది' అని చెపుతారు.

శ్రీమంతుడు తన ధనాన్ని కొంచెంకూడా పరోపకారం నిమిత్తం వినియోగించని సందర్భంలో—'గుర్రానికి తోక వుంటే తానే విసురుకుంటుంది గాని...' అని ఎత్తిపొడుస్తారు.

దీనినే గువ్వలచెన్నడు తన శతకంలో ఇలా వెలిబుచ్చాడు :

'తనవారి కెంతగల్గినఁ
దనభాగ్యమె తనకు సగును దగు వాజులకున్
దనతోఁకచేత వీఁచునె ?
గుణియైనన్ ఘోటకంబు గువ్వలచెన్నా'

యజమానులను గుర్రాలు రక్షించిన గాథలూ, విజయాలు చేకూర్చిన కథలూ ఎన్నో చదివాం. అయినప్పటికీ 'మోహరమున దానెక్కిన బాఱని గుఱ్ఱము గ్రక్కున విడువంగవలయు'నని సుమతీశతకకారుడు ఖచ్చితంగా చెప్పాడు.

గుర్రానికి దాణా 'ఉలవలు.' అందుకనే ఇంగ్లీషులో ఉలవలను 'Horse-Gram' అంటారు. దాణా బాగా పెడితేనే గుర్రం నవనవలాడుతూ వుంటుంది. దాణా లేని జట్కాగుర్రాలను బస్తీలలో నిత్యమూ చూస్తూనేవుంటాం. అటువంటిదే ఒక బక్కగుర్రాన్ని వర్ణిస్తూ ఒక హాస్యకవి ఇలా అన్నాడు :

'ఆచార్య గుర్రం - బహు దొడ్డ గుర్రం
గడ్డింత లేకన్ - దొడ్డంత తిరిగెన్'

కూడని పని చేయాలని బిర్రబిగిసి కూర్చునే వ్యక్తిని 'గుర్రం గుడ్డెక్కేను, జాగర్త' అంటారు. ఇది గోదావరిజిల్లా లోని 'పేకూరు' ద్రావిళ్ళు జరిపిన ఒక వినోదసంఘటన.

దారినబోయే ఒకడికి 'గుర్రపునాడా' ఒకటి దొరికిందట. అది చేతబుచ్చుకుని, తన అదృష్టానికి మురిసిపోతూ వాడు, 'ఒక నాడా ఎలాగా దొరికింది. ఇకేముంది ? తక్కిన మూడు నాడాలూ ఇలాగే సంపాదించి, ఒక గుర్రాన్ని కొనేస్తే తీరిపో తుంది' అని ఉవ్విళ్లూరాడట. గాలిమేడలు కట్టేవాళ్ళను గురించి ఈ సంఘటన చెపుతారు.

పొట్టిగుర్రాన్ని 'పోనీ' (Pony) అంటారు. హిందూ స్థానీలో ఒక సామెత వున్నది: 'పొట్టిగుర్రాని కొక కొరడా దెబ్బ కావాలి; అరబ్బీగుర్రాన్ని కొక చిటికవేస్తే చాలు.'

ఏదైనా ఉద్యమం వెర్రితలలు వేస్తున్నదని చెప్పటానికి 'చూడగా చూడగా గుర్రం గాడిదయింది' అని అంటారు.

ఆదరాబాదరాగా హడావుడిపడే మనిషినిచూచి 'కాస్త గుర్రాన్ని కట్టెయ్యవోయ్' !' అంటారు.

గుర్రంయొక్క గమనవేగాన్ని వర్ణించే సందర్భంలో ఒక చిత్రమైన సామెత వుంది: 'వడ్డీకి వడి గుర్రాలు చాలవు' అని. అనగా అసలు గుర్రమే వడి గలది. అంతకంటే వడిగా పెరిగి పోతుంది వడ్డీ.

ఒక్క వేగానికే కాదు. శక్తికికూడా అశ్వము ప్రామాణి కముగా స్వీకరింపబడుతున్నది. 'Horse Power' అనేమాట దీనికి సంబంధించినదే. పూర్వకాలమందు అనగా యంత్రములు కనిపెట్టకమునుపు పాశ్చాత్యులు కష్టమైన పనులన్నీ గుర్రాల

చేతనే చేయించేవారు. ఒక పనికి అవసరమయే శక్తిని వారు అశ్వముయొక్క సామర్థ్యానికి పోల్చేవారు. ఇప్పటికీన్నీ యంత్రాల శక్తిని కొలవటానికి అశ్వశక్తినే కొలబద్దగా పెట్టుకున్నారు. ఒక నిముషంలో 33000 పౌనుల బరువును ఒక అడుగు యెత్తుకు లేపటానికి అవసరమయే శక్తికే 'అశ్వశక్తి' 'Horse Power' అని పేరు పెట్టారు.

అశ్వమును గూర్చి ప్రచారంలో వున్న మరి కొన్ని సామెతలు :

'గాడిద సవారికంటె గుఱ్ఱపు తన్ను మేలు'
'చూపుల గుఱ్ఱం' (పై మెరుగేగాని స్వారికి పనికిరాదు)
'మట్టి గుఱ్ఱాన్ని నమ్మి ఏట్లో దిగినట్టు'
'దెబ్బలు గుఱ్ఱానివి ; అనుభవం రాజుగారిది'
'కడి అంటే నోరు తెరిచి, కళ్లెమంటే నోరు మూసినట్టు'
'తంటాలమారి గుఱ్ఱానికి తాటిపట్టె గొరపం'
'తేరగుఱ్ఱం ; తంగేడు బరికె' (ఉచితంగా వచ్చిన వస్తువు)
'బాపనవాని కొలువూ ; తెల్లగుఱ్ఱపు కొలువూ కొలువకూడదు'
(అంతులేని చాకిరీ)
'వారీ వీరీ గుఱ్ఱాలుకావు—విన్నయ్యగారి గుఱ్ఱాలు' (విశిష్టత)
'ఉభయ పవిత్రాలూ తిని వుద్దరిణెడు నీళ్లూ తాగి ఊహూ
అంటావా ఉత్తమాశ్వమా'
'ఊరే చేరవద్దు రౌతా అంటే గుఱ్ఱాన్ని యెక్కడ కట్టేది అన్నాడట'
'ఎక్కితే గుఱ్ఱపురౌతు ; దిగితే కాలిబంటు'
'ఎనుము తన్నునని గుఱ్ఱం వెనక్కు పోయినట్టు'
'ఎన్నడూ ఎరగని రెడ్డి గుఱ్ఱం ఎక్కితే ముందూ వెనకా అయిందట'
'గుఱ్ఱం చచ్చిందే కాకుండా గుంట తవ్వడాని కొక రూక'

'గుర్రం పేరు గోడ (ఘోడా—హిందీ—గుర్రం) అయితే జీను పేరు మదురు—నాకు అంతా తెలుసును అన్నాడట'.

'గుర్రానికి గుగ్గిళ్లు తినడం నేర్పాలా ?'
'విడిబడితే గుర్రం గాడిదతో సమానం'
'విశ్వమేలే నకులుడు అశ్వశిక్షకు డయినాడు'

'ముందుచూస్తే అయ్యవారి గుర్రముగా వుంది ;
వెనుక చూస్తే సాహెబు గుర్రముగా వుంది' (కోమటిసాక్ష్యము)

'గుర్రం గుర్రమే ; గాడిద గాడిదే'

'మాణవకుఁ డెంత సద్బుద్ధి మంతుఁడైనఁ
జెడును క్రమశిక్ష లేకున్నఁ జిన్ననాటఁ ;
వారువం బెంత లక్షణవంత మైన
కదను నేర్పింపకున్న నక్కఱకు రాదు'

—చిలకమర్తి





# సాహిత్యంలో 'గాడిద'

మానవుడికి ఒక దుర్గుణం వున్నది—ఎవరైతే తనను విశ్వాస సీయంగా సేవిస్తారో వాళ్లనే లాఘువపరచటం. ఈ విధంగా మానవుణ్ణి సేవిస్తూ మానవుడి కృతఘ్నతకు పాల్పడిన సంఘ జీవులలో 'గాడిద' ముఖ్యమైనది. గాడిదను కించెపరచటంలో ఆదికాలంనుంచీకూడా మానవుడు తన బుద్ధిబలాన్నంతా వినియోగించినట్టు మన సారస్వతం తడవితే స్పష్టమౌతుంది.

మానవుడు గాడిదను అసహ్యించుకోవటంతో సరిపెట్టుకోలేదు. ఎన్నోవిధాల అవమానించాడు.

పనీ పాటూ లేకుండా ఎవడేనా తిరుగుతూవుంటే. 'ఎందుకురా, అలా అడ్డగాడిదలా తిరుగుతావు?' అని మందలిస్తారు.

పని చేసుకునే ఒకతనిని పనిలేని వాడొకడు వచ్చి మాటల్లో పెడితే 'కూసేగాడిద వచ్చి మేసేగాడిదని చెరిపిం'దని అంటారు.

రుచి తెలియకుండా ఏదో ఇంత కడుపులో దట్టించే వాణ్ని చూసి 'గాడిద గంపెడు ఊకతిన్నట్టే ఉన్న'దని వ్యాఖ్యానిస్తారు.

ఒక పెద్ద పనిమీద దూరప్రదేశం వెళ్ళి అది నెరవేరక, తృప్తికోసం ఏదో ఒకటి చేతబట్టుకవస్తే 'కాశీ వెళ్లి గాడిదగుడ్డు తెచ్చినట్టుంది' అనటం కద్దు.

చీటికీ మాటికీ 'పోరా, గాడిదగుడ్డులాగా!' అని తిట్టటం కద్దు. ఇది వయోభేదం లేకుండా తెనుగునాట అందరికీ అలవాటయిన తిట్టు. ఇది అప్రయత్నంగా, అన్ని వేళలా నోటివెంట పెలువడుతూనే వుంటుంది. నిజానికి, గాడిదకు గుడ్డూ లేదు, ఈ తిట్టుకీ అర్థమూ లేదు.

మన కథాసారస్వతంలో — తప్పుచేసిన వాళ్ళకు ప్రభువులు 'సున్నంబొట్లు పెట్టి గాడిదమీద వూరేగించటం,' లేదా 'గాడిద ఉచ్చ పోసి బుర్ర గొరిగింపించటం' అవమానకరమైన గొప్పశిక్షలుగా విధించేవారు.

'గాడిదకొడకా!' అనే తిట్టు సర్వసామాన్యంగా అమలులో వుంటున్నది. ఈ తిట్టు చెవినిబడిన గాడిద 'అయ్యో!

వీడా నాకొడుకు!' అని విలపించిందట. దీన్నే ఒక మహాకవి చమత్కరించి చక్కటి చాటువు చెప్పాడు:

"అడిన మాటలు దప్పిన
గాడిదకొడుకంచు దిట్టగా విని 'యయ్యో!'
వీడా నాకొక కొడుకని
గాడిద యేడ్చెంగదన్న ఘనసంపన్నా!"

'గాడిదపిల్లకోమలం' గురించి, 'గార్దభస్వరం' గురించి మనవాళ్లు చేసే వెటకారం అంతా ఇంతా కాదు. గాడిద అరిస్తే అంత విన సొంపుగా వుండడాన్నిబట్టే, సంగీతజ్ఞానం లేనివాడు పాటపాడబోతే 'ఆహా, ఎంచక్కా వున్నదీ, ఖరహర ప్రియరాగం!' అని వెటకారం చేయటం మామూలు.

గార్దభస్వరం గురించి చెప్పడానికి ఒక సామెతకూడా వుంది: 'చక్కదనానికి లొట్టిపిట్ట; సంగీతానికి గాడిద' అని.

ఈ సామెతనే చాటువుగా చెప్పాడు ఒక కవి:

'ఉష్ట్రములదైన వైవాహికోత్సవమున
గాన మొనరించినవి పెద్ద గార్దభములు
ఎంత చక్కందనమ్మొ మఱెంత సుస్వ
రమ్మొ నా మెచ్చుకొనెను పరస్పరమ్ము!'

ఈ సందర్భంలో 'గాడిద సరసా'న్ని గురించికూడా చెప్పటం అవసరమే. ఋతుకాలంలో ఎగుపువచ్చినప్పుడు గార్దభ దంపతులు ఒకదానినొకటి ఫెడీ ఫెడీమని వెనుకకాళ్లతో తన్నుకుంటాయి. దీన్నిబట్టే ఎవళ్లయినా మోటుచేష్టలు చేసినప్పుడు 'గాడిదసరసంలాగే ఉం'దనటం మామూలు.

ఆలోచనా పాలోచనా లేకుండా ఒకడు గుడ్డిగా వివాద

వేసిన పని చేసుకుపోతూవుంటే 'గంధపుచెక్కలు మోసే గాడిద'తో పోలుస్తారు. అనగా పరిమళయుతమైన గంధపుచెక్కలు మోసే భాగ్యం కలిగినప్పటికీ గాడిద దాని స్వారస్యం గ్రహించలేక వీపుమీదనున్న భారాన్నే గణిస్తూవుంటుంది. కనుక విచక్షణజ్ఞానం లేని గాడిద గంధపుచెక్కలు మోసినా ఒకటే; చాకిమూటలు మోసినా ఒకటే. అందుచేతనే :

'అర్థమెఱుఁగని చదువు బల్ వ్యర్థమగును
గాని వానికి నెక్కుదు గణనసేయ
ఖరము మొయ్యదె చందన ఖండములను
మథితగజదనుజాయ నమశ్శివాయ'

—అంటున్నాడు చామర్తి శేషగిరిరాయడు తన 'నమశ్శివాయ శతకం'లో.

'మోత' అనేసరికి 'గాడిదమోత' అనే జాతీయం జ్ఞాపకానికి వస్తుంది. బట్టలుతికే చాకలికీ, మూటలుమోసే గాడిదకీ అవినాభావసంబంధం ఉంది. దూరం యోచిస్తే 'గాడిద' అనే జంతువు కేవలమూ చాకలివానికోసమే—మూటలు మోయటానికే—జన్మించిందా అని అనిపించకమానదు.

గాడిద కష్టజీవి. అదిమోసే చాకిమూటలబరువు సామాన్యంగా శక్తికి మించినదై వుంటుంది. ఈ సందర్భంలో ఒక వినోదసంఘటన గుర్తుకు వస్తున్నది :

ఒక ఉపాధ్యాయుడు విద్యార్థుల తాలూకు నోటుబుక్కులు తీసుకువెళ్తూంటే ఒక విద్యార్థి "ఏఁవిటి, మేష్టారూ! గాడిదబరువు మోస్తున్నారే!" అని తమాషాగా అన్నాడట. అందుకా ఉపాధ్యాయుడు తడుముకోకుండా, "ఇది ఒకగాడిద

బరువు కాదురా; అరవై గాడిదల బరువురా నాయనా!'' అన్నాడు చెప్పుదెబ్బ కొట్టినట్టుగా.

చెత్తా చెదారం ఇష్టంవచ్చినట్లల్లా పడవేస్తే ''ఏమిటి దంతా గాడిదగత్తర?'' అంటారు.

చక్రీవంతము, బాలేయము, రాసభము, గ(గా)ర్దభము, ఖరము, గాలిగాఁడు—అనేవి గాడిదకు నామాంతరాలు.

'గాడిద గడపర' అని ఒక మొక్క ఉన్నది. ఇది వైద్యంలో ఉపయోగించేది.

గాడిదను అతిహీనంగా, న్యూనపరుస్తూ 'గతిలేనివాడు గాడిదకాళ్లు పట్టుకొన్నట్టు' అంటారు. ఈమాట వినగానే పురాణ కాలంలో 'వసుదేవుడు గాడిదకాళ్లు పట్టు'కొన్న సంగతి స్ఫురిస్తుంది.

దీనినే భాస్కర శతకకర్త ఇలా చెబుతున్నాడు :

'ఘనుఁ డగునట్టివాఁడు నిజకార్యసముద్ధరణార్థమై మహిం
బనిపడి యల్పమానవుని బ్రార్థనచేయుట తప్పుగాదుగా
యనఘతఁ గృష్ణజన్మమున నావసుదేవుఁడు మీఁదుటెత్తుగా
గనుఁగొని గాలిగానికడకాళ్లకు మ్రొక్కఁడె నాఁడు భాస్కరా'

'గాడిదకాళ్లు' అనగానే ఒక సంగతి చెప్పకుండా వుండ లేము. నడుస్తూంటే ముడుకులు తగులుతూన్నట్టయితే వాడిని ''గాడిదకాళ్లవాడు'' అంటారు. గాడిదకాళ్లు దరిద్రహేతువని సాముద్రికులు చెబుతారు.

గార్దభ స్వరూపుడయిన ధేనుకాసురుడనే రాక్షసుణ్ని బలరాముడు సంహారించి భూలోకానికి వానిపీడ వదిలించాడు.

బ్రహ్మకు ఆదిలో అయిదు ముఖాలు ఉండేవట. అందులో ఒకటి గాడిదముఖం. దాన్ని శివుడు ఖండించిన ప్రదేశమే 'బ్రహ్మతీర్థం' అనే పేరుతో వెలిసివున్నది.

మన పురాణాల్లో గుర్రపుతలవాడు తుంబురుడు ఉన్నట్టే Shakespeareమహాకవి నాటకంలో గాడిదతలవాడు ఉన్నాడు. వాడి పేరే 'బాటామ్' - Bottom.

ప్రతాపరుద్రీయకవి "బూడ్దెలో పొర్లేది గాడ్దె కదా" అని తేలికగా అనిపించాడు.

'గాడిద పుండుకు బూడిదె మందు' అని ఒక వాడుక.

గాడిదకూ, బూడిదకూ గల సంబంధాన్ని సూచిస్తూ ప్రముఖ కవుల పద్యాలు:

'ఎట్టివారల కవనిలో నట్టివారె
మనను గలిసిన మిత్రులై మనలుచుంద్రు
మణికి బంగారమునకును మైత్రి గలియు
గాడిదకును బూడిదమీఁదఁ గరము ప్రీతి'

—చిలకమర్తి

'గాడ్దె మేనినిండ గంధంబుఁ బూసిన
బూదిలోనఁ బడుచుఁ బొరలు మరల
మోటువారి సొగసు మోస్తరియ్యది సుమీ
విశ్వదాభిరామ వినుర వేమ'

—వేమన

ఆంధ్రులకు ఉత్తేజము కలిగించే సుప్రసిద్ధమైన "బొబ్బిలి కథ"లో—విజయరామరాజు బొబ్బిలి రంగారావుతో రాయబారం నడుపుతాడు: 'మీసేనలూ మాసేనలూ కలిపి, యేకస్థలమై బుస్సీదొరను తిరస్కరిద్దా'మని. రంగారావు అడ్డుగా తల

ఊచాడు. అందుమీాదట విజయరామరాజు ఉగ్రుడై "ఈ యేడు బొబ్బిలికోటను పట్టుకొని, దానిని గాడిదలచేత దున్నింపకపోయి తినా, నాపేరు విజయరామరాజే కాదు" అని అంటూ మీాసం దువ్వి శపథం పడతాడు.

గాడిదనుగురించికూడా కొన్ని న్యాయములు ఉన్నాయి:

'ఖరీవిషాణన్యాయం: అంటే గాడిదకొమ్ములలాగ' లేని వస్తువునుగూర్చి చెప్పేటప్పుడు వర్తిస్తుంది.

నిష్ప్రయోజనం అనే మాటను విప్పిచెప్పటానికి 'గర్దభ రోమగణనన్యాయం' అంటారు. అనగా గాడిద వెంట్రుకలు లెక్కపెట్టినట్టు అని అర్థం.

గార్దభానికీ, దుర్జనుడికీ సామ్యం కల్పించారు మనవాళ్లు. ఇదే 'దుర్జనగర్దభన్యాయం'. దీని భావమేమిటంటే : దుర్జనుడు గాడిదలాంటివాడు. గాడిద మంచిస్థలాన్ని మలినం చేస్తుంది; దుర్జనుడు మంచివాళ్ల కీర్తిని మలినం చేస్తాడు. గాడిదను ఎంత కొట్టినా అంతే. అలాగే దుర్జనుడు ఎంత శిక్షించినా మంచి మార్గానికి రాడు.

ఆరంభంలో గాడిద గట్టిగా అరుస్తూ, క్రమంగా స్వరాన్ని తగ్గించుకొంటూ వస్తుంది. దుర్జనులతో చేసే మైత్రి కూడా ఇలాగే వుంటుందని తెలియచేసేది 'రాసభరుతన్యాయం'.

'యాదృశీ శీతలాదేవి తాదృశీ ఖరవాహనమ్' అని మరొక లోకోక్తి. ఎవరికి తగినట్టు వారికి మర్యాద చేసేపట్ల ఇది వర్తిస్తుంది. అందరు దేవుళ్లకీ అన్ని వాహనాలు అమరి వుండగా 'శీతలాదేవి'ని స్వరూపానికి తగినట్లు గాడిద వాహనం

మీంద ఊరేగిస్తారు. శీతలాదేవి (వ్యాధులకు అధిదేవత) కాళికాదేవి యొక్క అవతారమే.

రెండింటి మధ్యని ఏమీ పోలిక లేదని నిర్ధారించవలసి వచ్చినప్పుడు 'గుర్రం గుర్రమే; గాడిద గాడిదే' అని అంటారు.

గుర్రమూ, గాడిదా కాక మధ్యని కంచరగాడిద అని అదో రకం వున్నది. అయితే, గాడిదకు వర్తించిన ఈ నిందలన్నీ కంచరగాడిదకు వర్తించవు.

గ్రామాల్లో గాడిదలు కాక అడవుల్లో మరోజాతి గాడిద వుంది. అదే చారల గాడిద. దీన్నే ఇంగ్లీలో 'zebra' అంటారు.

వేదాతీతుడైన వేమన సయితం గాడిదను గురించి అనుకూలంగా చెప్పలేకపోయాడు. దాన్ని నిరసిస్తూ :

'గంగగోవుపాలు గంటెడైనను జాలుc
గడివెడైననేమి ఖరముపాలు ?'

అని అన్నాడు ప్రశ్నార్థకంగా.

'కుకవినింద' చేసేపట్ల శ్రీనాథ కవిసార్వభౌముడు 'కొండవీటి' గాడిదను చాలా యుక్తంగా ఉపయోగించుకున్నాడు :

'బూడిదబుంగవై యొడలు పోcడిమిదప్పి మొగంబు వెల్లనై
వాడలవాడలం దిరిగి వారును వీరును ఛీ యనంగ నా
గోడల గొందులం బెనచి కోయని యార్చెదు కొండవీటిలో
గాడిద, నీవునుం గవివి కావుగదా యనుమాన మయ్యెడిన్'

"గాడిద'ను నిందిస్తూ వ్యాప్తిలో ఉంటున్న మరికొన్ని సామెతలు:

'కుంటి గాడిదకు జారినదే సాకు'

'రాత రాజ్యం ఏలాలని వుంటే గ్రహచారం గాడిదలు కాయమని వుందిట'

'చూడగా చూడగా గుర్రం గాడిదయిందిట'

'గాడిద సవారికంటె గుర్రపు తన్ను మేలు'

కవి అన్న వాడెల్లా ఈ విధంగా గాడిదను ఆడిపోసుకోవడమే పనిగా పెట్టుకోవటం విచారింపదగ్గ విషయం. అయినా దాని ఘనతను వెల్లిడించే అనుకూల విషయాలుకూడా లేకపోలేదు.

దైవపరంగా చూస్తే, గాడిద అశ్వనీదేవతలకు వాహనమై వుంది. ఏసుప్రభువు జెరూసలెంలో ప్రవేశించడం గాడిదను ఎక్కే.

గాడిద గుణగణాలను ఆప్యాయంగా వర్ణిస్తూ, 'రాసభ కుమార' మకుటంతో మన పురాణం సూర్యనారాయణ తీర్థులవారు రసవంతమైన ఒక్క చక్కటి శతకాన్ని రచించి వున్నారు. అన్నట్టు—'శుక్లాంబరధరం విష్ణుం' అనే ప్రార్థన శ్లోకానికి 'గాడిద' పరంగా అర్థం చెప్పిన కవినికూడా మనం మరువలేము.

— ..

## ఈ పుస్తకము కూర్పుటలో తోడుపడిన వివిధ గ్రంథములు కృతజ్ఞతతో పేర్కొనబడుతున్నవి :

---

భారతం - భాగవతం - రామాయణం

బైబిలు - పంచతంత్రం

భర్తృహరి సుభాషితములు - అమరకోశము

కాశీఖండము - పల్నాటి వీరచరిత్రము

లక్ష్మీనారాయణ పరిణయం - దశావతార చరిత్రము

బృందావన విహారము - ఒడయనంబి విలాసము

తెలుగు సామెతలు - ఆంధ్ర లోకోక్తిచంద్రిక

చాటుపద్య మణిమంజరి - సంస్కృత లోకోక్తులు

ఇవిగాక - వివిధ శతకములు - పురాణగ్రంథములు - స్థలమాహాత్మ్యములు - జానపద గాథలు - పిల్లల పాటలు - పాతపాటలు - సమస్యలు - చాటుపద్యములు - వేడుకపద్యములు - మరి ఎన్నో పత్రికా వ్యాసములు.

* *
*

# సాహిత్యంలో సర్పం

**Sri K. Subbaramappa**, M.A.,B.Ed., Head of the Department of Telugu, University of Mysore, writes :—

"మీ 'సర్పం' చాలా బాగుంది. నన్ను మిక్కిలి ఆకర్షించింది. కన్నడంలోనికి నేనూ అనువదించి...ప్రకటించదలచి, మీ పుస్తకంలోని కొన్ని ఘట్టాలను ఏరి, అనువదించుటకై పూనుకొంటిని."

## ఇందులోని విశేషాలు కొన్ని :

నాగులు—నన్నయ
పాముల పండగలు
పాములు—జాతులు
పాములు—బాలలు
పాములు—దేవుళ్లు



పాములు—గాథలు
భూతసర్పాలు
శతకవాఙ్మయం—పాము
కరవని పాము
పాముల పెద్దలు
'మధురానగర' కథనం
లోకోక్తులు—జాతీయాలు
సామెతలు—పోలికలు
పాముల పుట్ట
కృష్ణసాపాలు
ఉపాఖ్యానాలు—చాటువులు
సంగీతం—స్థలమహిమలు
పాముపడగ—అంతరార్థం
ఇంకా ఎన్నో....

★ అ మ ర గా థ లు - 1. అ లె గ్జాం డ రు ★



రచన :

ఎం. ఎస్. శాస్త్రి, బి. యస్. సి., (ఫార్మ్ సి)

★

ఎవ్వారి దివ్యచరితములు మానవ జీవితమును క్రమమార్గమునకు మలిచి, పరివర్తనము కలిగింప శక్తి గలవో అట్టి పవిత్రమూర్తుల చిత్రగాధలు. ఏ మహిమాన్వితుల చరిత్రలు చదువరి హృదయాంతరాళమున మొలిసి, వెలుగునిచ్చి, శాశ్వతముగ నచ్చుపడి ఉత్సుకతను పెంపొందించునో, అటువంటి సంతత స్మరణీయుల పరమార్థసాధకములగు చిత్రగాధలు. ఎన్నిసారులు విన్నను క్రొత్తగనె తోచచుండెడి కల్యాణాత్మకమగు ఈ గాథలు తెలుగు సారస్వతమునకే క్రొత్తలు. ఈ శీర్షికలో తొలుదొల్త ప్రపంచవిజేత అగు అలెగ్జాండరు చక్రవర్తిని గురించిన అపూర్వగాధలు చిత్రితములయినవి.

## అభిప్రాయములు :

'నే నిది చదువుచు మరల నొకతూరి బాల్యము చవిచూచితిని. నీ పుస్తకము బాలుర శీలము పెంపున కొక రసాయనము.'

—శ్రీ వేలూరి శివరామశాస్త్రి

... ... ...

'వేయి కల్పనాకథలు చదివినదానికంటె ఇట్టి మహనీయుని జీవితచరిత్ర మొక్కటి చదివినందువల్ల కలిగెడి ఫలితము అనంతము.'

—శ్రీ కనుపర్తి వరలక్ష్మమ్మ

## AMARA GADHALU

# 1. ALEXANDER


[THE AUTHOR]

"There is an element of hero-worship inherent in every human being. The lives of great men, it is often said, do remind us that we could make our lives sublime. Whether that is always true or not, stories of heroes' lives seldom fail to elate the young heart. It is, therefore, a good idea to present interesting and inspiring anecdotes from the adventurous and extraordinary life of Alexander the Great, in easy readable Telugu for the benefit of children. The selection of themes shows considerable discrimination on the author's part and the thirty-four anecdotes are full of human interest and are at the same time eminently representative of the life and message of the hero of Macedon who became the conqueror of the world—or more accurately that part of it which was known to him. The booklet is quite suitable for non-detailed study by lower form students. It can also be read for information or even sheer entertainment by the general reader, young or old."

1—3—'53 —*The Indian Express*

## [అచ్చులో ఉన్నది]

‘సమయ మయూఖాళ్కి, మొక్క నిమిషంబు వృథా చనఁ గ్రమ్మ్రతింప నే
రము; మన యాయువా త్రుటిపరంపర యాట నెఱింగి నిద్రమాం
ద్యమును దొలంగి మీ పనుల నారయుడో జనులార యంచు డం
బముగ మెడన్నిగిడ్చి కృకవాకువు గూసెడి నింటికొప్పునన్॥’

—కవికోకిల

★

# సాహిత్యంలో ‘పక్షిరాజ్యం’


రచన:
ఎమ్.ఎస్.శాస్త్రి
బి.ఎస్.సి.(ఫార్మసీ)


★



—ఇది—

‘సాహిత్యంలో....’ అను శీర్షిక క్రింద వెలువడే మూడవ ప్రచురము. ఇందు - కోడి, కాకి, కోకిల, హంస, నెమలి, కొంగ - కొక్కెర, గద్ద, గబ్బిలం, గుడ్లగూబ, గువ్వ-పావురము, చిలుక మొదలగు పక్షులనుగురించిన సాహిత్య విశేషములు అతి రమ్యముగ నవ్యఫణితిలో చిత్రింపబడినవి.



